# పరాశర జ్యోతిషము

మరియు

గణపతి ముని

# హోరా నిర్ణయ సంగ్రహము







తెలుగు వ్యాఖ్యానము



జి. విజయ్

డా. జి. వి. సరోజ M.A.M.Ed.DS.Ph.D.

ప్రకాశకులు

జి. మీనాక్షి & సన్స్

ప్రథమ ప్రచురణ : 1993



**G. VIJAY**
13, Natesan Street
T. Nagar, Madras-17



**Price : Rs. 30-00**

ప్రతులకు :
**రాణి బుక్ సెంటర్**
నెం. 62, పాండిబజార్
మద్రాసు–17

Y. ANAND
1-9-34 D
RAMNAGAR
Hyderabad 42

ముద్రణ :
**ది కొమ్మినేని ప్రింటర్స్**
నెం. 11, మేడ్లీ రోడ్,
టి. నగర్, మద్రాసు–17

పురోణి.

సనాతన మతమని చెప్పబడు మన మతమునకు వేదములు పరమ ప్రమాణములు. వేదమునకు షడంగములు. ఇవి ప్రాతిశాఖ్యములు. వేదాంగ ములలో జ్యోతిషమొకటి, ఇది వేద చక్షువు (జయతు జయతు జ్యోతిషం వేద చక్షుః). యజుర్వేదాంగ జ్యోతిషమును సమకూర్చినవాడు లగధుడన్న మహాత్ముడు. జ్యోతిషము శుభకార్య సిద్ధికొరకు (యజ్ఞకాలార్ధ సిద్ధయే). కాలము నకు శుభాశుభ గుణలక్షణములున్నవా? కాలమునందు ఋతువులున్నవి. ఒక్కొక్క ఋతువు యొక్క ధర్మము ఒక్కొక్కతీరు—దినము, రాత్రి వీటి లక్షణములు వేరు. ఇవి కాలమునందు భిన్నభిన్న లక్షణములే కదా! అట్లే శుభాశుభ గుణములు—ఈ శుభాశుభ గుణములు కాలగతిలో గ్రహముల చలన మును బట్టి స్థితులనుబట్టి కలుగుచున్నవి.

ఇంతకును జ్యోతిషము శాస్త్రమని అంగీకరింపక తప్పదు. అయితే దానిని బట్టి ఫలితములు సరిగా నుండుటలేదేమని యొక ప్రశ్న. ఫలితములు చెప్పువానిపై ఆధారపడినవి. తప్పయినచో చెప్పువాని సామర్థ్యహీనత. శాస్త్ర దోషము కాదు. ఏ విజ్ఞానశాస్త్ర శాఖ విషయమునగాని ఎవ్వరుగాని సర్వము తెలిసినవారు లేరుకదా! అట్లే జ్యోతిషము విషయమున కూడ.

మూడువందల అరువది డిగ్రీలు కల ఖగోళ చక్రమున తొమ్మిది గ్రహ ముల సాపేక్ష స్థితి విధానములు అనంతములు. అనంతమైన గ్రహస్థితు లుండగా అల్పమైన మానసిక పరిధి గలవారు సరిగా చెప్పలేక పోవుటలో ఆశ్చర్యములేదు. అనంతముతో సంలీనము (attunements with infinity) కావించుకొన్న మహాత్ములు ఫలితములను సరిగా చెప్పగలరు. వారిది వాక్శుద్ధి, వారి విద్యకు 'వాసనా వాసిత' మనిపేరు.

జ్యోతిష మహాసముద్రమును చుళుకీకృతము చేసిన మహానుభావులలో పరాశర మహర్షి యొకడు. ఆయన పేర పెక్కు గ్రంథములు ప్రచారములో నున్నవి. ఆయన్నిటిని పరిశీలించి-ఒక సమీచీన క్రమపద్ధతిగా సంకలింప బడిన గ్రంథమిది. పరాశరుని మతమునకు జ్యోతిషమున కొంత ప్రత్యేకత కలదు. దానిని వెల్లడించుటకే సంకలన కర్త కృషిచేసెను.

శాస్త్ర మర్యాదలను తెలిసికొన గోరువారిని-జ్యోతిష ప్రియులను ఈ కృషి అలరింప జేయగలదని విశ్వసించుచున్నాను.

రుధిరోద్గారి చైత్రశుద్ధ పాడ్యమి తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు
గురువారము-14-4-'83

# PREFACE

I am very proud to state that G. Vijay, the well known Astrologer has discovered the framework of the Great Sage Parasara's Vedic Astrology. Vijay has spent more than thirty five year's in studying and scrutinizing the ancient source books, palm leaves, etc., and finally he achieved the great success in his research work by discovering the key-concept of the Prasara System. Later, this result also has been validated while reading Ganapati Muni's works.

It is interesting to know how this book **Parasara Jyothishamu** got its present form. Sri Vijay has been guiding me in understanding the great truths of Astrology and Mantra Sastra. After explaining to me his recent findings, he wanted me to study carefully his book, **'Quintessence of Parasara'** and Ganapati Muni's **'Hora Nirnaya Sangraha'**. The urge to systematise and spread the doctrines of Parasara resulted in publishing this work.

Since the various verses ascribed to Parasara found in various ancient works have been already compiled by Vijay for his Telugu Version, verses for this work have been carefully selected, translated, commented upon, and examples are also given wherever necessary. It was possible for us to find out many principles and facts while analysing a verse or a gaoup of verses. In certain cases, our discussions continued for days together.

The book is meant for both the beginners and the scholars. A practising astrologer can predict accurately and pinpoint any event. The beginners are requested to go through minutely every word of this book. It is definitely possible for them to become an expert in the course of time.

The Vimsottari system followed by many Astrologers must have been propounded by Parasara. This system includes both the dasas of Rahu and ketu. Sri Vijay has explained this point in his **Introduction** of this work elaborately.

At times, even the popular Astrologers strugle to predict the results of the dasas and bhuktis. But the reader can realise

how accurately one can ascertain the results of a dasa or a bhukti by following Parasara's system and Ganapati Muni's Methods.

This book defines the concept of Raja yoga. If we analyse on the basis of Kona-Pratipa, Subha-Papi, only in a very few cases Rajayogas are found. Further, it is astonishing to note how a debilitated planet uplifts a person while an exalted planet pushes him downwards from his pedestal.

I realised the value of this book, only when I prepared its Tamil version. While writing in English, we had to analyse every verse in various perspectives, bnt while translating it into Tamil, I was able to understand the whole system in toto and also the connections amongst the verses, devoid of any contradictions.

Sri Vijay has formulated very carefully the Tables of **Udu** dasa antara dasa, etc. If a horscope is casted accurately using a standard Ephemeris, it is definitely possible to find the past, present and the future events of the person following the methods prescribed in this work.

**Dr. G. V. Saroja,** Ed.,D.S.,Ph.D
Madras



## Experts are requestsd to concentrate on the following Chapters :

1. ప్రస్తావన.
2. కాలమానము.
3. శుభులు-పాపులు (ఆధిపత్యమున).
4. దశాంతర దశాధ్యాయము.
5. విశేషాధ్యాయము.

# కృతజ్ఞతలు

ఈ గ్రంథ రచనలో అమిత ప్రోత్సాహ మొసంగి, విశేషమైన సలహా లిస్తూ నాతోబాటు 1988 నవంబరు 14 వరకూ పరిశ్రమించిన పితృతుల్యుడు, సోదరతుల్యుడు, గురువు అయిన కీ॥శే॥ శ్రీ భాగవతుల సూర్యనారాయణశాస్త్రి (భారవి) గార్కి,

ప్రారంభంలోనే ప్రెస్ కాపీ తయారగుటకు ముందు సూక్ష్మపరిశీలన గావించి పురోణి వ్రాసి యిచ్చిన శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగార్కి (వీరు అనంతరం తురీయాశ్రమ స్వీకారం చేసి అద్వయానంద స్వామిగ సిద్ధి పొందారు).

నాతో సమానంగా చర్చించి ప్రెస్ కాపీ తయారు చేయుటలోనూ-తమిళ-ఆంగ్ల ప్రతులు తయారు చేయుటలోనూ మిక్కిలి కృషి సల్పిన డా॥ జి. వి. సరోజగార్కి.

సకాలంలో చక్కగా ముద్రించి యిచ్చిన-'ది కొమ్మినేని ప్రింటర్స్' అధినేత శ్రీ కొమ్మినేని కృష్ణమూర్తిగార్కి, ప్రెస్ సిబ్బందికి కృతజ్ఞతలు.

అంకితము

పరాశర జ్యోతిషము

జ్యోతిశ్శాస్త్రమును సులభ పద్ధతిలో ప్రజల కందజేసిన ఏకైక

మహర్షి

పరాశర మహర్షి

చరణకమలములకు



హోరా నిర్ణయ సంగ్రహము

పరాశర మతమును యథాతథముగ పాఠకులకు కరతలామలక

మగునటుల తెలిపిన ప్రప్రథమ మహనీయులు

శ్రీ కావ్యకంఠ వాశిష్ట గణపతిమునికి

భక్తి సుమంజలితో

# విషయసూచిక

## పరాశర జ్యోతిషము



## హోరా నిర్ణయ సంగ్రహము

# పరాశర జ్యోతిషము

## ప్రస్తావన :

> కాలజ్ఞైర్బహుదాప్రోక్తాః శాస్త్రాః జ్ఞానవివర్ధకాః
> త్రేయుగాదిషు జ్ఞాతవ్యాః కలౌ పరాశరీ స్మృతాః

ఈ శ్లోకము పరంపరాగతముగ అభియుక్తోక్తిగ వినిపిస్తున్నది-దీని యందు ప్రత్యేకముగ పరాశరుని గూర్చి మాత్రమే తెలుపుట ఎందుకన్న జిజ్ఞాస వలన దీనిని పూర్తిగ పరిశీలించవలెనని అభిలాష కలిగినది.

అసలు జ్యోతిష శాస్త్రమును విస్తరింపజేసి ప్రచారము చేసిన మహనీయులలో పరాశర మహర్షి ఒకడు. అందుకు ప్రమాణముగ లభించు శ్లోకములు :

> బ్రహ్మాచార్యో వసిష్ఠో త్రిమనుః పౌలస్త్యలోమశౌ
> మరీచి రంగిరోవ్యాసో నారదః శౌనకో భృగుః
> చ్యవనో యవనో గర్గః కశ్యపశ్చ పరాశరః
> అష్టాదశైతే గంభీర జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకాః

మరియొక శ్లోకములో 'ఆచార్య' అను చోట 'సూర్యః' అని వుంది. మిగిలిన పదునేడుగురు పేర్లు ఇవే- కాని వరుస క్రమంలో కొంత మార్పుంది. ఈ రెండింటిలో ఏ పాఠమునసుసరించినను పరాశరుని స్థానము త్రోసివేయరానిది.

మొత్తముపై పదునెనమండ్రు ఋషులని తెలుస్తుంది. వీరందరిలో—

1. బ్రహ్మ (పితామహ) = బ్రహ్మ (పితామహ) సిద్ధాంతము.

2. వశిష్ట-వశిష్ట సిద్ధాంతము.

3. పౌలశ–పౌలశ సిద్ధాంతము.

4. లోమశ–లోమశ సిద్ధాంతము.

5. పరాశర–సౌరసిద్ధాంతము.

ఈ అయిదు సిద్ధాంతములు గ్రహించి వరాహమిహిరుడు పంచ సిద్ధాంతిక వ్రాసెను.

పరాశరుని సౌర సిద్ధాంతము కాలక్రమేణ ఉచ్ఛారణ దోషము వలన హార లేదా హెూర అయినది. అటువంటి సౌర సిద్ధాంతము ఆధారముగ తెలిపిన సౌర శాస్త్రమే హెూరాశాస్త్రమైనది.

ఇందు 'లోమశ' అనునది 'రోమక' అయినది. (కల్యాణవర్మ పైతెలిపిన పదునెనమండ్రు ఋషులు పేర్లు తెలుపుటలో 'రోమశ' అని వాడినాడు).

ఏది ఏమైనను అసలు పరాశరునికి మాత్రము ప్రాముఖ్య మెందుకీయ బడినది అనే పరిశీలన ప్రారంభమైంది. అందుకు పరాశరుని పేరుతోను, పరాశరేతరుల పేర్లతోను గల గ్రంథములను పరిశీలించిన గాని ప్రయోజన ముండదనే భావన కలిగినది. అందువలన ఆయా గ్రంథముల కొరకెంతో ప్రయత్నించాను. ప్రయాసకు తగినటుల అన్ని గ్రంథములు లభ్యము కాలేదు. లభ్యమైనవాటిని తరచి చూడగ అవన్నియు వరాహమిహిరుని సమకాలికులు లేదా తదనంతరము వారు రచించినటుల గ్రాహ్యమైనది.

అందు వరాహమిహిర గ్రంథములు పంచసిద్ధాంతిక-స్వల్పసంహిత-లఘుజాతకము-వివాహ పటలము మొదలైన గ్రంథములు, తన శిష్యులు లేదా వ్యాఖ్యాతలు తమతమ అభిప్రాయములు చేర్చి బృహద్గ్రంథములుగ జేసిరి. అందు బృహజ్జాతకములో వరాహమిహిరిడు ఇట్లు తెలిపాడు :— "పూర్వ ఋషులచే చెప్పబడిన శాస్త్రము లనేకములుగ పరిశీలించి స్వల్ప

ప్రయోగయుక్తితో అనల్పార్థ సిద్ధి గల శైలిలో ఈ హోరాశాస్త్రమను నావను ప్రారంభించుచున్నాను". (బృ.జా.శ్లో-2)

గ్రంథాంత్యమున ఇట్లున్నది–"ఆదిత్య దాసు పుత్రుడను తండ్రి వలన బోధింపబడిన జ్ఞానము గలవాడను కాపిత్థమను గ్రామమందు సూర్య వర ప్రసాదినైన, అవంతికాదేశ నివాసినైన వరాహమిహిరుడను నేను మునుల మతముల జూచి యథామతముగ సులభముగ తెలియునటుల ఈ హోరా శాస్త్రమును చేసితిని" అని తెలిపాడు.

తన గ్రంథములో కొన్ని తావులందు సమకాలీనులైన గౌతమ, గర్గ, సత్యాచార్యులను కూడ పేర్కొని అందు అనేక సందర్భములలో సత్యాచార్య మతమును ఆమోదించుచున్నటుల తెలిపెను. కేవలము నాభస యోగాధ్యాయ ములో మాత్రము ఒకే ఒక చోట 'పరాశర' ప్రస్తావన వచ్చింది (శ్లో-2). మరెచ్చటనూ లేదు. అయితే గ్రహములకు గల భావాధిపత్యము అందువలన కలుగు శుభాశుభ ఫలితములు గురించి ఏమియు తెలుపకుండ కేవలము గ్రహముల నైసర్గిక శుభత్వ–పాపత్వము–మిత్రత్వ–శత్రుత్వము–అధిమిత్ర–అధిశత్రుత్వము-మూల త్రికోణములు మొదలైనవి తెలుపుతూ ద్వాదశ భావములను మూడు ప్రధాన భాగములుగ విభజించెను. అవి లగ్న, చతుర్థ, దశమ, సప్తమ భావములు కేంద్రములనియు వాటి ననుసరించిన ద్వితీయ పంచమ, లాభ, అష్టమ భావములు ఫణపరములనియు, తృతీయ, షష్ఠ, నవమ వ్యయ, భావములు ఆపోక్లిబము లనియు మూడు వర్గములుగ విభజించి కేంద్రములందున్న గ్రహములు శుభులైన శుభఫలము లిత్తురనియు పాపులైన పాపఫలము లిత్తురనియు ఆపోక్లే బలములందు పాపులుండుట శుభమనియు శుభులుండుట పాపమనియు, ఫణపరములందున్నచో మధ్యమ మనియు తెలిపెను. ఇది కేవలము గ్రహముల నైసర్గిక శుభాశుభములను బట్టి తెలిపిన విషయమేగాని భావాధిపత్యమును గూర్చి ఎచ్చటను తెలుపలేదు. వరాహమిహిరుని సమకాలీనుడు అయిన కాళిదాసు "ఉత్తర కాలామృతము" అను గ్రంథము రచించెను. అందు ప్రారంభములో ఇట్లున్నది :–"ప్రాగేవాద్య దళే సమస్తముదితం సంజ్ఞాదికం విస్తరా" అనగా 'ప్రథమ భాగములో ముందుగనే సంజ్ఞలు మొదలగునవి విస్తారముగ తెలిపితిని.' అని. అయితే ఆ

గంథమేమిటో, పేరేమిటో విదితం కాదు. అది లభ్యంకాలేదు. అయినను 'ఉత్తరకాలామృతము' నందు కొన్ని సంజ్ఞలు తెలిపెను. వరాహమిహిరుని వలె కేంద్ర ఫణపర అపోక్లిబముల తెలుపుతూ, పంచమ నవమ భావములు కోణములనిన్నీ ; తృతీయ షష్ఠ దశమ, ఏకాదశ భావములు ఉపచయముల నిన్ని మిగిలిన ఎనిమిది భావములు అనుపచయములనిన్ని ఆరు, ఎనిమిది, పన్నెండు భావములు త్రికములని తెలిపెను. మరి వరాహమిహిరుడు త్రికముల గూర్చి తెలుపలేదు-ఉపచయముల గూర్చి సంజ్ఞా అధ్యాయము శ్లోకము 15 లో ఇలా అన్నాడు :-

"............ఇత్యుపచయా న్యరికర్మలాభ-దుశ్చిక్య సంజ్ఞిత గృహాణి ననిత్య మేకే." అనగా ఈ ఉపచయ స్థానములు ఆరు-పది-పదునొకండు. మూడు భావములు కొందరనిత్యమంటారు అని. అనగా ఇది పరాశరేతరులకు సమ్మతము కాదు. కేవలము పరాశరమతం ప్రకారం ఇవి అంగీకరించ బడినవి అని విదితమవుతోంది. కాని కాళిదాసు కూడా ఆమోదించాడు.

వరాహమిహిరుడు ఆయుర్దాయాధ్యాయములో ప్రారంభములో "మయ, యవన, మణిత్థ శక్తి పూర్వైః" అని అన్నాడు. అనగా పరాశరుని తండ్రి యైన శక్తికి పూర్వమందున్న వారని కదా! అటువంటపుడు పరాశరునికి పూర్వమందున్న వారి మతముల ప్రకారము తెల్పాడన్నది విదితమవుతూంది.

దీనినిబట్టి 'లఘుపరాశరి' గ్రంథము వీరిరువురకు పూర్వమున్నదనక తప్పదు. ఏలన కాళిదాసు తన ఉత్తరకాలామృతములో కేంద్ర కోణ సంబంధ ముల గురించి తెలిపెను. చాలవరకు 'లఘుపరాశరి' ననుసరించినటుల తెలు స్తూంది.అలాగే కొన్ని సందర్భములందు తన సొంత అభిప్రాయములతో కొన్ని ప్రాథమిక విషయములు తెలిపాడు.

కాళిదాసు పరాశర పద్ధతిలో చెప్పబడిన సంజ్ఞలు ముఖ్యమైనవి తెలుప లేదు. ఏలన కేంద్రములు నాలుగింటిలో చతుర్థ-దశమములు లక్ష్మీస్థానములు కోణములలో పంచమ నవములు విష్ణు స్థానములు అని చెప్పక వదలివేశాడు- అలా చెప్పి లక్ష్మీ విష్ణు స్థాన సంబంధములు అంటే తేలికగ బోధపడేది. అలాకాక కేవలం కేంద్రకోణ సంబంధం అన్నాడు.

కాని వరాహమిహిరుడు తన బృహజ్జాతకములో కేంద్రకోణములు తదధిపతులు సంబంధము గురించి ఎచ్చటను చెప్పలేదు.

ఈ ప్రకారము పరిశీలిస్తే పరాశర-పరాశరేతర పద్ధతులలో ప్రాథమిక వ్యత్యాసములు తెలుస్తాయి. ఇక వీరికి అనంతరము వారైన కల్యాణవర్మ (సారావళి గ్రంథకర్త), గణేశ దైవజ్ఞుడు (గ్రహలాఘవము గ్రంథకర్త) వైద్యనాథ పండితుడు (జాతక పారిజాత గ్రంథకర్త) మంత్రేశ్వరుడు (ఫల దీపిక గ్రంథకర్త) మొదలగువారు అనేకులు పరాశర పద్ధతిని ప్రత్యేకముగా వారి వారి గ్రంథములందు విశదపరచలేదు సరికదా వారు కూడ కేవలము వరాహమిహిర కాళిదాసులనే అనుసరించినట్లు తెలుస్తూంది.

పరాశర పద్ధతిలో రచింపబడినవిగ తెలుపబడే ముద్రితాముద్రిత గ్రంథములు వివిధ నామములతో పెక్కు గలవు. గ్రంథములు మిక్కుట మైనటులనే వాటి యందలి పాఠాంతరములు కూడ కోకొల్లలుగ కనుపిస్తున్నాయి. వీటిలో ఏ రెండు గ్రంథములూ ఒకదానితో మరొకటి (కొన్నికొన్ని సందర్భములందు) ఏకీభవించవు–ఆ ప్రకారముగనే ఆ సంస్కృత గ్రంథములు కూడ భావ స్పష్టీకరణలో భేదిస్తున్నాయి. సూక్ష్మ పరిశీలన చేసిన మీదట ప్రక్షిప్తాలు కూడ అనేక మున్నట్లు తెలుస్తూంది. ఈ ప్రస్తావన ఆదిలో ఉదహరించిన శ్లోకమున్నూ, పరాశరుని పేరుతో బయల్పడిన బహుళ గ్రంథముల భేదాభిప్రాయములున్నూ ఈ నాటి జ్యోతిషులలో, ఈ శాస్త్రము మీద కొద్దో గొప్పో ఆసక్తి ఉన్నవారిని, ఈ శాస్త్రము గురించి ఇదమిద్ధమైన నిర్ణయము చేయుటకు వీలులేని అశక్తులనుగ చేయుచున్నవి, నాయీ గ్రంథ సంకలన ప్రయత్నమునకు ఇవే ముఖ్య కారణములు.

జ్యోతిష శాస్త్రముతోనూ, ఫలభాగముతోనూ నాకున్న పరిచయము పురస్కరించుకుంటే పరాశర మతమును అనుసరించడము మంచిదని అనిపించడమేగాక నిత్యజీవితములో కూడ నాకు ముంజేతి కంకణమైనది. అయితే ఈ పరాశర మతము పరాశరేతరుల మతముకు గల వ్యత్యాసం ముఖ్యంగ గమనించవలెను. అది గమనించకుండ ఇతర ఋషుల మతాలతో ఈ పరాశర మతం జమచేసి ఫలితములు తెలుపుటకు ప్రయత్నించినందున 'కాళిదాసు' మొదలు నేటి వరకున్న వివిధ గ్రంథకర్తలు వారి వారి గ్రంథములందు

స్వకపోల కల్పితములు గావించి చెప్పవలసి వచ్చింది. అది సాధ్యపడని విషయమని గ్రహించినందుననే వరాహమిహిరుడు పరాశర పద్ధతి వదలి బహుఋషి సమ్మతం గ్రహించి తన గ్రంథమును రచించెను. సౌర సిద్ధాంతం అందరికి ఆమోదమైనది. కనుకనే అందరూ సిద్ధాంత భాగం వరకు సౌర సిద్ధాంతం అనుసరించిరి కాని జ్యోతిష భాగమందు మాత్రం పరాశరుని పద్ధతి వేరైనది.

ఇంతవరకు తెలిపిన గ్రంథకర్త లందరికంటె వెనుక వచ్చిన అనగా పందొమ్మిదవ శతాబ్దాంతమున ఇరువదవ శతాబ్దారంభంలో వున్న శ్రీ భగవాన్ రమణ మహర్షి శిష్యుడను అని చెప్పుకున్న శ్రీ కావ్యకంఠ గణపతిముని గోకర్ణ క్షేత్రంలో సంస్కృత పండితుల కోరికపైన "హోరా నిర్ణయ సంగ్రహమ్" అను గ్రంథంలో పరాశర పద్ధతిని విపులీకరించెను—అది ఒకే ఒక గ్రంథం పరాశర సిద్ధాంతంను యథాతథంగ తెలిపిన గ్రంథం.

దానిని గూడ ఇందు రెండవ భాగంగ పొందుపరచడమైనది.



# సాధారణ సంజ్ఞాధ్యాయము

పరాశర మునిం నత్వా తస్య హెూరాం నిరీక్ష్యచ
వక్ష్యామ్యుడు దశా మార్గే సారం శాస్త్రాను సారతః

పరాశరమునికి నమస్కరించి-తన యొక్క హెూరాశాస్త్రమును పరిశీలించి- ఆ శాస్త్రానుసారంగ అందలి సారంను నక్షత్ర దశా పద్ధతిని తెలిపెదను.

ఇచట ప్రతి ఒక్కరు గుర్తించవలసిన విషయం మన ప్రాచీన శాస్త్రములు అనగా ఇటువంటివి యుగాదిగ పారంపర్యంగ వస్తున్నవి- అసలు ఋషులుచే అందించబడిన ఈ శాస్త్రం వారి శిష్యుల మూలముననో లేదా వారల ననుసరించిన వారి మూలముననో యధాతథంగ అందించబడినవి- కొన్ని సందర్భములలో అనేకానేక కారణాల వలన మూలమునకు భిన్నమైన రీతిలో అనేక గ్రంథములందు గానవస్తుంది. అందుకు కారణం గ్రంథములు పారంపర్యంగ అనేక హస్తములు మారుటవలన మధ్యలో వారి వారి అభిప్రాయాలు చెప్పుటవలన అని తెలుస్తూంది.

ఇచట ఈ అజ్ఞాత గ్రంథకర్త పరాశరుని హెూరాశాస్త్ర మందలి సారం-అదియును నక్షత్రదశాపద్ధతిలో తెలుపనున్నట్లు చెబుతున్నాడు, ఇదే భావంగల శ్లోకాలు పరాశర పద్ధతిలో తెల్పే గ్రంథములలో కనుపిస్తాయి. కాని స్వల్పంగా పదప్రయోగంలో వెనుకముందులుంటాయి, లేదా ఇదే భావం స్ఫురించేలా వేరు పదజాలం ఉంటుంది.

భూగోళ జాయమానానాం తత్కాలోడు గ్రహస్థితే
గుణానురూప వృత్తిత్వం సూచ్య సూచక భావతః

భూగోళమందు పుట్టిన ప్రాణులకు ఆయా కాలమందున్న నక్షత్ర, గ్రహముల స్థితివలన సూచ్య సూచక భావంచేత గుణానురూప వృత్తులు నిర్ణయింపబడును.

జ్యోతిశ్శాస్త్రే వినిశ్చిత్య హోరికం ఫలమీరితం
ఇష్టానిష్ట పరిజ్ఞానా దనిష్టస్య ప్రశాంతయే
ఇష్టసాధన సిద్ధ్యర్థ ముపాయో ఒయంప్రదర్శితః

జ్యోతిశాస్త్రము వలన పైన తెలిపినటుల ఫలములను తెలుసుకొనగలం. శుభాశుభములయిన ఫలితములను తెలుసుకుని, అశుభఫలములకు తగు శాంతులు చేసి ఇష్టసాధన సిద్ధికి ఉపాయమును ఇది ప్రదర్శించుచున్నది.

సప్తవింశతి తారాణాం దస్రాదీనాం పృథక్పృథక్
పాదైశ్చతుర్భి ర్గగనే శింశుమారః ప్రతిష్ఠితమ్
ప్రాక్ప్రా గ్గతోడుచక్రం తదష్టోత్తర శతాంఘ్రికమ్
ప్రత్యఙ్ముఖం చలత్వేన మేరోర్నిత్యం ప్రదక్షిణమ్
నవాంఘ్రి రూపిణ స్తత్ర మేషాద్యా రాశయః స్మృతాః
గ్రహాస్తదీశ్వరా స్తైస్తుకాలావస్థా ప్రదర్శ్యతే.

అశ్విని మొదలుగ ఇరువదేడు నక్షత్రాలు. ఒకొక్కటి నాలుగు పాదాలు గగనమందు శింశుమార చక్రంను ప్రతిష్ఠించుచున్నవి. అట్టి నూట ఎనిమిది పాదాలు గల తూర్పుగతి నక్షత్ర చక్రం మేరువును (సూర్యుని) ప్రత్యఙ్ముఖముగ (facing west) ప్రదక్షిణం చేస్తూ తొమ్మిది పాదాలు ఒక రాశి చొప్పున మేషాది పన్నెండు రాసులను ఏర్పరచుచు, గ్రహాలు ఆ రాసులకు అధిపతులుగ కలిగి కాలావస్థలను, అనగా భూత భవిష్యద్వర్తమానాల అవస్థలను ప్రదర్శించుచున్నది.

అనగా అశ్విని మొదలు ఇరువదేడు నక్షత్రాలు. ఒక్కొక్క నక్షత్రం నాలుగు పాదాలు చొప్పున మొత్తం నూట ఎనిమిది పాదాలు. తొమ్మిది పాదాలు ఒక రాశి చొప్పున నూట ఎనిమిది పాదాలు పన్నెండు రాశులగును— అట్టి ద్వాదశ రాశ్యాత్మక చక్రం మేరువుకు (సూర్యుని) ప్రత్యఙ్ముఖంగ ప్రదక్షిణ చేయుచున్నది. ఆ రాసులకు గ్రహాలు అధిపతులుగ ఉండి భూత భవిష్యద్వర్తమాన ఫలాలను తెలుపుచున్నవి.

మేషో వృషశ్చ మిథునః కర్కి సింహ కుమారికాః
తులా శిశ్చ ధను ర్నక్రే కుంభో మీనేచ రాశ్యాని

అథ ఖేటాః రవి శ్చంద్రో మంగళశ్చ బుధ స్తథా
గురు శ్శుక్ర శ్శనిః రాహు కేతూ శ్చైతే యథాక్రమమ్.

మేషం, వృషభం, మిథునం, కర్కాటకం, సింహం, కన్య, తులా, వృశ్చికం, ధనుసు, మకరం, కుంభం, మీనము అని రాసులు పన్నెండింటికి వరుసగ పేర్లు. తర్వాత గ్రహాల పేర్లు– రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని, రాహు, కేతు అనునవి.

కుజ శుక్రజ్ఞ చంద్రార్క బుధ భార్గవ భూమిజాః
గుర్వర్కి సౌరి గురవః క్రమా న్మేషాది నాయకాః
రాహుకేతోస్తు సర్వేపిచ రాశ్యాః స్వగృహాః స్మృతాః

క్రమంగ మేషం మొదలు పన్నెండు రాసులకు కుజ, శుక్ర, బుధ, చంద్ర. సూర్య, బుధ, శుక్ర, కుజ, గురు, శని, శని, గురువు. అధిపతులగుదురు. రాహు కేతువులకు అన్ని రాసులయందు ఆధిపత్యం గలదు.

రాశీనాముద యోలగ్నం జన్మని ప్రాశ్నికేపివా
సయేవ ప్రథమోవర్గ స్త్వన్యేవర్గాస్తదంశకాః

జనన సమయంలో లేదా ప్రశ్న సమయంలో ఉదయించు రాశి లగ్నం అది ప్రథమ వర్గం- ఇతరములు దాని అంశలు.

త్రింశద్భాగాత్మకో రాశి ర్హోరా రాశ్యర్థ ముచ్యతే
లగ్న త్రిభాగో ద్రేక్కాణో నవాంశో నవమాంశకః
ద్వాదశాంశో ద్వాదశాంశ స్త్రింశాంశ స్త్రింశ దంశకాః
జ్ఞాతవ్యా శ్చాత్ర షడ్వర్గా స్తత్తదంశాః క్రమేణతుః

ముప్పది భాగాలు ప్రమాణం గలది రాశి- అ రాశిలో సగ భాగంను హోర, మూడవ వంతును ద్రేక్కాణం, తొమ్మిదవ వంతును నవాంశ, పన్నెండవ వంతు ద్వాదశాంశ, ముప్పదవ వంతు త్రింశాంశ, అని ఈ ఆరు విధాల అంశలను షడ్వర్గులు అని అంటారు.

అనగా ఒక రాశి ముప్పది భాగాల చొప్పున పన్నెండు రాసులకు 360 భాగాలు అగును. ఇది ఒక వృత్తం అన్న మాట. రాశిని రెండు భాగాలు చేసి మొదటి 15 భాగాలు, తర్వాత 15 భాగాలు. వీటికి హోర అని పేరు. అలాగే మూడు భాగాలు చేసిన మొదటి 10 భాగాలు వరకు ప్రథమ ద్రేక్కాణము. తర్వాత 20 భాగాలు వరకు ద్వితీయ ద్రేక్కాణం తర్వాత 30 భాగాల వరకు తృతీయ ద్రేక్కాణం అని పేర్లు. ఆ ప్రకారమే రాశిని తొమ్మిది భాగాలు చేసిన ఒక్కొక్కటి 2 $\frac{1}{3}$ భాగాలు చొప్పున తొమ్మిది భాగాలగును. రాశిని పన్నెండు భాగాలు చేసిన ఒక్కొక్కటి 2 $\frac{1}{2}$ భాగాలు చొప్పున 12 భాగాలగును. రాశిని 30 భాగాలు చేసిన ఒక్కొక్కటి ఒక భాగం చొప్పున 30 భాగాలగును. ఒక భాగం అనగా ఒక డిగ్రీ. ఒక డిగ్రీ 60 నిమిషాలు-ఒక నిమిషం 60 సెకనులు.

హోరార్కేందూ రోజరాశౌ యుగ్మభే చంద్రసూర్యయోః
చరే స్వపుత్ర నవపాః స్థిరే ధర్మ స్వ పుత్రపాః
ద్విశరీరే పుత్ర ధర్మ స్వ ద్రేక్కాణ నాయకాః

బేసి రాసులయిన మేష, మిథున, సింహ, తులా, ధనుర్, కుంభ రాసులందు ప్రథమ హోర (15 భాగాలు)కు సూర్యుడు అధిపతి, తర్వాతిది అయిన ద్వితీయ హోర (16-30)కు చంద్రుడధిపతి. సరిరాసులయిన వృషభ, కర్కట, కన్యా, వృశ్చిక, మకర, మీన రాసులకు ప్రథమ హోరకు చంద్రుడు ద్వితీయ హోరకు సూర్యుడు అధిపతులు.

చర రాసులైన మేష, కర్కట, తులా మకరములందు ప్రథమ ద్రేక్కాణానికి ఆ రాశ్యధిపతియే. ద్వితీయ ద్రేక్కాణానికి ఆ చరరాశి నుండి పంచమ రాశ్యధిపతియు తృతీయ ద్రేక్కాణంకు నవమ రాశ్యధిపతియు ద్రేక్కాణాధిపతులు.

స్థిరరాసు లయినటువంటి వృషభ, సింహ. వృశ్చిక, కుంభ రాసులందు ఆ రాసులకు తొమ్మిదవ రాశ్యధిపతి ప్రథమ ద్రేక్కాణంకు-ఆ రాశ్యధిపతి ద్వితీయ ద్రేక్కాణంకు దానికి పంచమ రాశ్యధిపతి తృతీయ ద్రేక్కాణంకు అధిపతులు.

ద్విస్వభావ రాసులకు వాటికి పంచమ రాశ్యధిపతి ప్రథమ ద్రేక్కాణంకు, నవమ రాశ్యధిపతి ద్వితీయ ద్రేక్కాణంకు–ఆ ద్విస్వభావ రాశ్యధిపతులు తృతీయ ద్రేక్కాణంకు అధిపతులు అగుదురు.

దీనిని సులభముగ గుర్తుంచుకొనుటకు : ఒక చరరాశి, స్థిరరాశి ద్విస్వభావరాశి ఎప్పుడూ ఒకదాని కొకటి కోణమందుండును. అనగా మేష సింహ ధనుసులు పరస్పర కోణమందుండును. అట్లే కటక, వృశ్చిక, మీనము; తులా, కుంభ, మిథునములు. మకర వృషభ కన్యలు - వరుసగా చరస్థిర ద్విస్వభావ రాసులగును. ఏ రాశియందైనా చర రాశ్యధిపతి ప్రథమ ద్రేక్కాణంకు, స్థిర రాశ్యధిపతి ద్వితీయ ద్రేక్కాణంకు, ద్విస్వభావ రాశ్యధిపతి తృతీయ ద్రేక్కాణంకు అధిపతులగుదురు.

మేష త్రికోణే మేషాద్యా నవాంశే నవరాశిపాః
వృషత్రికోణే నక్రాద్యా యుగ్మకోణే తూలాదయః
కర్కికోణే కర్కటాద్యా యత్కోణం తచ్చరాదికం.

నవాంశ అధిపతులు–ఒకదానికొకటి కోణమందున్న చరస్థిర ద్విస్వభావ రాసులకు అన్నింటికి వాటి యొక్క చరరాశి నుండి వరుసగ తొమ్మిది రాసుల అధిపతులు నవాంశాధిపతులగుదురు. మేష త్రికోణం అనగా మేష సింహ ధనుసులు. వీటికి మేషము నుండి వరుసగా తొమ్మిది రాసుల అధిపతులు నవాంశాధిపతు లగుదురు.

అట్లే మకర, తులా, కర్కట కోణములందున్న రాసులకు వరుసగా ఆ చరరాసులైన మకర కర్కట తులల నుండి రాశ్యధిపతులను గుర్తించవలెను.

అగ్నరాశి ముపక్రమ్య ద్వాదశాంశేశ్వరాః క్రమాత్

ఏ రాశికి ద్వాదశాంశలు వాని అధిపతులు తెలుసుకొనవలెనో ఆ రాశి నుండి వరుసగ పన్నెండు రాసుల అధిపతులు ద్వాదశాంశాధిపతు లగుదురు· ఉదా :- మేషమునకు వరుసగా మేషము నుండి పన్నెండు రాసులధిపతులు. అలాగే కన్యారాశికి కన్య నుండి, వృశ్చికముకు వృశ్చికము నుండి వరుసగా ద్వాదశాధిపతు లగుదురు.

భౌమ మందేజ్య సౌమ్యశుక్రాశ్చ పంచౌజభే క్రమాత్
త్రింశాంశ నాయకాః యుగ్మే వ్యత్యయేన గ్రహాః స్మృతాః
భాగాస్యుః పంచ పంచాష్టౌ సప్త పంచేతి భౌమాదిః

కుజ శని గురు బుధ శుక్ర అయిదుగురు వరుసగ బేసి రాశియందును సరిరాశియందు వ్యత్యస్తముగ అనగా శుక్ర బుధ గురు శని కుజ అయిదు గురు త్రిశాంశ అధిపతులగుదురు. అయిదు — అయిదు — ఎనిమిది - ఏడు - అయిదు భాగలు చొప్పున వరుసగా కుజ శని గురు బుధ శుక్రుల కగును.

అనగా బేసి రాశిలో మొదటి అయిదు భాగలకు కుజుడు. తర్వాత అయిదు భాగలకు శని, తర్వాత ఎనిమిది భాగలకు గురువు, తర్వాత ఏడు భాగలకు బుధుడు-తర్వాత అయిదు భాగలకు శుక్రుడు అధిపతులగుదురు. సరిరాశిలో శుక్ర (5) బుధ (7) గురు (8) శని (5) కుజ (5) భాగలకు అధిపతు లగుదురు.

రాశి శీలాదికం సర్వం శాస్త్రోదితం సమ మత్ర
గ్రహ శీలాశ్చ భావానాం సంజ్ఞాః బ్రూమో విశేషతః *

రాశి శీలాదులు ఇతర ఋషులచే తెల్పబడినది దీనికి సమం, గ్రహ శీలాలు-భావములు సంజ్ఞలు ఇచట విశేషించి చెప్పబడును.

అనగా రాసుల స్వభావాది గుణములు సిద్ధాంత భాగమునకు సంబంధించినది అంతయు ఇతర ఋషులు తెలిపిన దానితో ఈ పరాశర పద్ధతి ప్రకారము తెలిపినది సమముగ ఉంది. అందు వ్యత్యాసములేదు కాని గ్రహముల మధ్య సంబంధములు అనగా నైసర్గిక శుభ పాపత్వములు మిత్ర శత్రు సమత్వములు మొదలైన విషయములలో పరాశర పద్ధతిలో అమోదంలేదన్న మాట. అలాగే భావాలు వాటి సంజ్ఞలు అన్నీ ఇచట విశేషముగ చెప్పబడును. అదియే ఇందలి గొప్పదనం.

రాశి శీలములు పట్టిక ప్రకారము కడపట చూచుకొనదగును.

---

* బుధైర్భావాదయస్సర్వే జ్ఞేయా స్సామాన్య శాస్త్రతః
ఏతచ్ఛాస్త్రాను సారేణ సంజ్ఞా బ్రూమో విశేషణ॥

గ్రహశీలా :

సూర్యేందూ మండలాఖ్యాతౌ కుజజ్ఞేజ్యసితా ఒసితాః
తారాగ్రహాః స్మృతాః పంచ-ఛాయాఖేటౌ తమోధ్వజౌ

రవి చంద్రులు మండల గ్రహములు కుజ బుధ గురు శుక్ర శని ఈ అయిదు తారాగ్రహములు-రాహు కేతువులు ఛాయాగ్రహములు.

రాసులకు అధిపత్యము తెలుపునపుడు రవి-చంద్రులకు ఒక్కొక్క రాశికి అధిపత్యముంది. తారాగ్రహములకు రెండేసి రాసుల కాధిపత్యం ఉంది. రాహు కేతువులకు అన్ని రాసులందు అధిపత్యముంది-(చూపు 9).

నిసర్గభావే శుభౌ గురుశుక్రౌ చంద్రో మధ్యమః
ఉదాసీనో బుధః ఖ్యాతః పాపాః రవి కుజార్కజాః
రాశ్యాధిప సమౌ స్మృతౌ తమోగ్రహౌ యథామతః
అథాపరం గ్రహ శీలాదికం బ్రూమో విశేషతః

నైసర్గికముగ గురు శుక్రులు శుభులు-చంద్రుడు మధ్యముడు బుధుడు ఉదాసీనుడు రవి కుజ శనులు పాపులు. తామున్న రాశ్యధిపతికి సమం రాహు కేతువులు.

చంద్రుడు అమావశ్య నాడు పాపి పౌర్ణమి రోజున శుభుడు మిగిలిన రోజులలో త్రైరాశిక పద్ధతిని (అనుపాతం) తెలుసుకొనవలెను. ఇచట ఇతర పద్ధతులకు దీనికి గల వ్యత్యాసము గుర్తించవలెను.

ర-మధు పింగళ దృక్సూర్యశ్చతురస్రః సుచిర్తథా
పిత్త ప్రకృతికో ధీమాన్ పుమాన ల్పకచోద్విజ

తేనె వంటి రంగు-పింగళ నేత్రములు-చతురస్ర దేహము. శుచి-పిత్తప్రకృతి బుద్ధిమంతుడు పురుషుడు స్వల్పకేశములు.

చం-బహువాతకఫః ప్రాజ్ఞశ్చంద్రో వృత్తతనుర్ద్విజ
శుభదృఙ్మధు వాక్యశ్చ చంచలో మదనాతురః

వాతకఫ ప్రకృతి పండితుడు గోళశరీరుడు శుభదృష్టి మధుర వాక్యములు చంచలుడు కామాతురుడు.

కు—క్రూరోర క్తేక్షణో భౌమశ్చపలోదారమూ ర్తికః
సి త్త ప్రకృతికః క్రోధీ కృశమధ్య తనుర్ద్విజ.

క్రూరుడు ర క్తనేత్రుతు చపలుడు ఉదారహృదయుడు పి త్త ప్రకృతి క్రోధి కృశించిన మధ్యమ శరీరుడు.

బు—వపుః శ్రేష్ఠ శ్లిష్టవాక్చ హ్యతిహాస్యరుచిర్బుధః
పి త్తవాన్ కఫవాన్ విప్ర మరుతప్రకృతి స్తథా.

శ్రేష్ఠ శరీరుడు శ్లేష (ద్వందార్థం) మాట్లాడువాడు హాస్యప్రియుడు పి త్త కఫ వాత ప్రకృతులు కలవాడు.

గు—బృహద్గాత్రో గురుశ్చైవ పింగళో మూర్ధజేక్షణైః
కప ప్రకృతికో ధీమాన్ సర్వశాస్త్ర విశారద॥

విశాల దేహము పింగళవర్ణ కళ్ళు కేశములు గలవాడు. కఫ ప్రకృతి బుద్ధిమంతుడు సర్వశాస్త్రములు తెనసినవాడు,

శు—సుఖీ కాంతవపుః శ్రేష్ఠః సునేత్రశ్చ భృగో స్మృతః
కావ్యకర్తా కపాధిక్యోఽనిలాత్మా వక్రమూర్ధజః

సుఖి స్త్రీరూపం శ్రేష్ఠుడు మంచి కండ్లు కావ్యములు చేయువాడు కఫ వాత ప్రకృతి వంకర జుట్టు

శ—కృశదీర్ఘతను శ్శౌరిః పింగ దృశ్యో నిలాత్మకః
స్థూలదంతోఽలసః పంగుః ఖరరోమకచో ద్విజ

కృశించిన దీర్ఘ శరీరుడు పింగళ నేత్రం వాత ప్రకృతి, స్థూలదంతములు మందుడు కుంటివాడు బిరుసైన రోమాలు.

పశ్యన్తి స ప్తమం సర్వే శనిజీవకుజాః పునః
విశేషతశ్చ త్రిదశ త్రికోణ చతురష్టమాన్

అన్ని గ్రహములు తామున్న రాశికి సప్తమ రాశిని చూచును. అదనంగ తామున్న రాశి నుండి మూడు-పది భావములు శనియు, అయిదు-తొమ్మిది భావములు గురువు నాలుగు ఎనిమిది భావములు కుజుడు చూచును.

## కాలమానము

కాలమును కొలుచుటలో అభిప్రాయ భేదములున్నవి. దీనిని కొంత వరకు ప్రస్తావనలో చర్చించడమైనది. అందును గూర్చి మరికొన్ని వివరములు ఇటీవలి వారిచే చెప్పబడినవి చూద్దాం :-

బ్రహ్మం దివ్యం తథా పిత్ర్యంప్రాజాపత్యంచ గౌరవం
సౌరశ్చ సావనం చాంద్ర మార్క్షం మానానివై నవ
చతుర్భిః వ్యవహారోఽత్ర సౌర చాంద్రర్క్ష సావనైః
బార్హ స్పత్యేన జ్ఞేయముత్పాతాన్నాన్యైస్తు నిత్యశః

బ్రహ్మం— దివ్యం— పిత్ర్యం— ప్రజాపత్యం- గౌరవం (గురు) సౌరం- సావనం-చాంద్రం-అర్షం (నక్షత్రం) లను పేర్లతో కాలమానములు తొమ్మిది. వ్యవహారోపయోగమునకు ఇచట ముఖ్యంగ సౌర చాంద్ర నక్షత్ర సావన ములు ఉపయోగించుచు— బార్హస్పత్యమానమువలన ఉత్పాతములను గురించి తెలుసుకొనవలెను. మిగిలిన నాలుగు అనిత్యములు.

దీనినే స్వల్ప పాఠ భేదముతో ఇలా చూడవచ్చు :-

అబ్దః పంచదా ఋషిభిః పరికీర్తితాశ్చయథా
చాంద్రం నాక్షత్రం సౌరంచ బార్హస్పత్యంతు సావనం

సంవత్సరములు అయిదు రకములని ఋషులు తెలుపుతున్నారు. చాంద్రం నక్షత్రం సౌరం బార్హస్పత్య సావనం అని.

ఇందులో చాంద్రం సౌరం సావనం నాక్షత్రం గూర్చి ప్రస్తావనలో తెలుసుకున్నాం. అయితే అయిదవదైన బార్హస్పత్యమును ఎక్కువగా సంహిత లందు వాడుదురు. అయితే వీటి గణనలో గల వ్యత్యాసములు ఇలా ఉన్నాయి :

దర్శావధిం మాస ముశన్తి చాంద్రం
నక్షత్ర మిందోర్భగణా శ్రయాశ్చ
సౌరం భాస్కరరాశి భోగా త్తథా
సంజ్ఞ మార్యాః త్రింశద్దినం సావనమ్.

1. శుక్లప్రతిపత్తు (పాడ్యమి) మొదలు అమావాశ్యాన్తము వరకు మాసము. దీనిని చాంద్రమానమందురు.

ఇందు మాసమునకు 29 ½ రోజులు. ఇట్టివి పన్నెండు మాసములు ఒక సంవత్సరం. ఇందు 354 రోజులు. కాని ప్రస్తావనలో తెలిపిన యుగము ప్రకారము ఇది 354 నుండి 384 వరకూ మారుచుండును. దీనినే నేటికిని ఇస్లామీయులు అనుసరిస్తున్నారు.

2. చంద్రుడు ఇరువదేడు నక్షత్రములలో సంచరించు కాలము ఒక మాసము. ఇట్టివి పన్నెండు మాసములు ఒక సంవత్సరము. ఇందు సంవత్సరముకు సుమారు 330 రోజులు. మాసముకు 27.321 రోజులు. దీని ప్రకారమే వారముకు ఏడు దినములు- నాలుగు వారములు ఒక మాసముగ ఏర్పరచబడినది. ఇది నక్షత్ర మానము.

3. సూర్యుడు ఒక రాశిలో సంచారము చేయు కాలం ఒక మాసం. పన్నెండు రాసులకు పన్నెండు మాసాలు ఒక సంవత్సరం. ఇందు సంవత్సరమునకు 365 ¼ రోజులు. ఇది భూమి సూర్యుని చుట్టుటకగు కాలం, దీనిని సౌరమాస మందురు. దీనినాధారముగా సిద్ధాంత భాగముండును.

4. ముప్పది దినములు ఒక మాసము. అట్టివి పన్నెండు మాసములు ఒక సంవత్సరం. 360 దినములు గలది సూర్యోదయము నుండి మరల సూర్యోదయము వరకు ఒక రోజు. దీనిని సావన మానమందురు.

5. ఇక అయిదవది గురువు ఒక రాశిలో సంచరించు కాలము-ఒక సంవత్సరం. దీనియందు చాంద్రమానమువలె సంవత్సరముకు సుమారు 355 రోజుల నుండి 380 రోజుల వరకు ఉండును. దీనిని బార్హస్పత్య మాన మందురు.

ఈ అయిదున్నూ ఒకదాని కొకటి భేదిస్తూ ఉన్నాయి. అలాగే వీటి ఉపయోగమునందు కూడ భేదములు ఉన్నాయి. అనగా ఏ కాలమానము ఎందుకు ఉపయోగపడును అని.

సర్వే సర్వత్రోత్పాతా బార్హ స్పత్యంచ ప్రశస్యతే
సౌరమానో వివాహాదౌ యజ్ఞాదౌసావనం స్మృతం
ఆబ్దికేపితృకార్యేచ చాంద్రమానం ప్రశ స్యతే
జననే ఆయుర్యోగాద్యాశ్చ నాక్షత్రమానోచ్యతే.

ఎల్ల ప్రాంతములందు ఎప్పుడు ఏ విధమైన ఉత్పాతములు సంభవించునో తెలుసుకొనుటకు బార్హస్పత్య మానం ప్రశస్తం. అనగా ఉత్పాతములన : ఉప్పెనలు, భూకంపములు, తుఫానులు, అతివృష్టి, అనావృష్టి యుద్ధములు, ప్రభుత్వ మార్పులు మొదలగునవి. ఇటువంటివి తెలుపునది సంహిత అందురు.

సౌరమానం ప్రకారం వివాహాది శుభకార్యములు. అనగా ముహూర్త భావమునకు సంబంధించిన అన్ని విషయాలు దీనిని బట్టి ఆచరించవలెను.

యజ్ఞములు యాగములు అనగా దైవకార్యములకు సంబంధించిన విషయములందు సావన మానమును అనుసరించవలెను.

ఆబ్దికములు అనగా మరణానంతరము జరుపు అపరకర్మలకు–పితృ కార్యములకు చాంద్రమానమును అనుసరించవలెను.

జననము మొదలు మరణము వరకూ జరుగు అన్ని విషయములు నిర్ణయించుటలో నక్షత్ర మానమును అనుసరిచవలెను.

ఈ చెప్పిన కాలమానములు అన్నియు ప్రస్తుతము ఎవరూ అనుసరించుట లేదు. అందున గ్రెగేరియను కాలండరు ప్రకారము సంవత్సరమున 365/6 రోజులున్ననూ దశాభుక్తుల లెక్కలందు నెలకు 30 రోజులు చొప్పున 12 నెలలకు 360 రోజులు మాత్రమే అందరూ గుర్తించి ఫలిత

ములు తెలుపుచున్నారు. నక్షత్ర మానమును ఎవ్వరూ అనుసరించుటలేదు- అటులనే దేవకార్యములందు సావనమానం అనుసరించుటలేదు. అమలునందున్న దశాపద్ధతులు పరిశీలించుదాం!

వరాహమిహిరుని పద్ధతికి పరాశర పద్ధతికి గల వ్యత్యాసము ఇచట పొందుపరచబడింది.

| గ్రహం | పరాశర పద్ధతి | వరాహమిహిరుడు తెలిపినది | |
|---|---|---|---|
| | సం. | సం. | సం. |
| రవి | 6 | 19 | 20 |
| చం | 10 | 25 | 1 |
| కుజ | 7 | 15 | 2 |
| బుధ | 17 | 12 | 9 |
| గురు | 16 | 15 | 18 |
| శుక్ర | 20 | 21 | 20 |
| శని | 19 | 20 | 50 |
| రాహు | 18 | — | — |
| కేతు | 7 | — | — |
| మొత్తం | 120 | 127 | 120 |

పరాశర పద్ధతిలో రాహుకేతువులకు స్థానమున్నది. కాని పరాశరేతర పద్ధతి లేదా వరాహమిహిర పద్ధతిలో రాహుకేతువులకు స్థానము కల్పింపబడలేదు.

అనేకమైన ఇతర దశాపద్ధతులు కూడ వున్నవి. అయితే కొందరు అవి పరాశర పద్ధతిగ వారి రచనలలో చూపుచున్నారు.

ఇక వారములకు సంబంధించి :- ఉత్తరాషాఢ శ్రవణ నక్షత్రముల మధ్య అభిజిత్తను నక్షత్రమును కల్పించి మొత్తము 28 నక్షత్రములుగ తెల్పిరి. అట్టి 28 నక్షత్రములకు 28 రోజులు-నాలుగు వారములు-

హారముకు ఏడు రోజులు (ర-చ-కు-బు-గు-శు-శ) గ్రహముల నామములతో ఏర్పడినవి-అట్టి మాసములు 12 అయిన ఒక సంవత్సరము.

అయితే జూలియస్ సీజరు కాలం వరకు చాంద్రమానము అనుసరించ బడింది. నెలకు 29 లేదా 30 రోజుల చొప్పున మొత్తం 354 రోజులు ఇది క్రీ.పూ. 46 వరకూ అమలులో వుంది. అప్పట్లో ఈజిప్టు దేశీయులు సౌర మానమును అనుసరించెడివారు. ఆ యీజిప్టు ఖగోళ శాస్త్రవేత్తల సహాయంతో జూలియస్ సీజర్ 365/6 రోజులున్న సంవత్సరం పొందుపరచెను.

వేదమాసాలకు సీజరు కాలం వరకున్న మాసాలు. అనంతర మార్పులు క్రింది పట్టికలో తెలుసుకొనగలరు :

| వేదమాసం | ఆంగ్ల మాసం | సీజరు కాలము వరకు |
|---|---|---|
| 1. మధు | ఫిబ్ర 20 నుండి మార్చి 21 కు | మార్స్ (గ్రహము పేరు) |
| 2. మాధవ | మార్చి 22 నుండి ఏప్రి 21 | అప్రైన్ (అఫోర్డయిటస్ అను దేవత) |
| 3. సుక్రః | ఏప్రి 22 నుండి మే 21 | మెర్క్యురీ లేదా మైరా (గురువు భార్య) |
| 4. సుచిః | మే 22 నుండి జూన్ 21 | జూనో. (స్వర్గ రాణి లేదా రోమన్ తెగ) |
| 5. నభః | జూన్ 22 నుండి జూలై 22 | క్విన్టలిన్ (ఐదు) |
| 6. నభస్యః | జూలై 23 నుండి అగ 22 | సెక్టిస్ లైన్ (ఆరు) |
| 7. ఇషః | అగ 23 నుండి సెప్టె 22 | (సప్తంబర్ (ఏడు) |
| 8. ఊర్జః | సెప్టె 23 నుండి అక్టో 22 | ఆక్టోబర్ (ఎనిమిది) |
| 9. సహః | అక్టో 23 నుండి నవం 21 | నవంబర్ (తొమ్మిది) |
| 10. సహస్య | నవం 22 నుండి డిసెం 21 | డిసంబర్ (పది) |
| 11. తపః | డిసెం 22 నుండి జన 20 | జానస్ (ద్విముఖ రోమన్ దేవత) |
| 12. తపస్య | జన 21 నుండి ఫిబ్ర 19 | ఫిబ్రువ (లాటిన్ దేవత) |

సీజరు, అంతవరకు ఉన్న ఎక్కువ తక్కువలను సరిపెడుతూ లీపు సంవత్సరమును ప్రవేశ పెట్టెను. ఆ సమయమున "జానస్" మాసము

ప్రారంభమగునవుడు దానిని 'జాన్యవరి'గా ప్రారంభించి 'దసంబర్' పన్నెండవ మాసముగ తెలిపెను. అందు 'క్వింటలిన్'కు బదులు తన పేరును 'జూలై' అని ఆ మాసముకు పేరిడెను.

అనంతరం అగస్టస్ సీజర్ సెక్టస్సలిన్ అను మాసంను తన పేరున 'అగస్ట్'గ కీ.పూ. 8 వ సం.లో మార్చెను.

ఇందులో ఇంకనూ కొంత లోపమున్నదని పోప్ గ్రగేరియన్ క్రీ.శ 1582లో సవరించి 13-12-1582 అర్ధరాత్రిని 31-12-1582 (1-1-1583) అని నిర్ణయించెను; దీని ప్రకారము సంవత్సరంకు 365 రో- నాలుగు సంవత్సరాల కొకసారి లీపు సంవత్సరం 366 రోజులు. ప్రతి నూరు సంవత్సరాలు లీపు సంవత్సరం కాదు. అనగా 1600; 2000, 2400.... ...లీపు సంవత్సరములు. 1700-1800-1900 మొదలైనవి లీపు సంవత్సరములు కావు—

దీని ప్రకారం ఉడు దశను అనుసరించినచో ఫలములెట్లు సరిగా వచ్చును గాన పండితులు దీనిని గమనించి ముందు విద్యార్థులకు సరియైన పద్ధతిని తెలిపెదరని ఆశిద్దాం.

ఫలాని నక్షత్రదశా ప్రకారేణ వివృణ్మహే
దశా వింశోత్తరీ చాఽత్ర గ్రాహ్యా నాఽష్టోత్తరీ మతా *
కృత్తికాత స్సమారభ్య గణయే జ్జన్మ భావధి
నవభిశ్చ హరేద్భాగం శేషం గ్రహదశా భవేత్
రవౌషడ్ దశచన్ద్రేచ భౌమేసప్త విధున్తుదే

* దశాబహు విధాస్తాసు ముఖ్యావింశోత్తరీమతా.

అష్టోత్తరి షోడశోత్తరి ద్వాదశోత్తరి పంచోత్తరి శతాబ్దికా చతురాసీతి సమా ద్విసప్తతిసమా షష్టిహాయని షట్త్రింశత్సమా.

కాలచక్ర-చక్ర-కాల-

చర-స్థిర-కేంద్ర-కారక- బ్రహ్మగ్రహ- మండూక- శూల-యోగార్ధ-దృగ్దశ-త్రికోణ-రాశి-పంచస్వర-యోగిని-పిండ-నైసర్గిక-అష్టవర్గ-సంధ్యా-పాచక-తారా- మొదలైనవి.

అష్టాదశ గురో భూపా శ్శనౌచైకోనవింశతిః
బుధే సప్తదశా ఉబ్దాశ్చ కేతౌ సప్త ప్రకీర్తితాః
నఖాః శుక్రేచ విజ్ఞేయా వింశోత్తర శతంమతమ్
సంపూర్ణమితి విఖ్యాతం జన్మకాలేతు జన్మభే
గతం యదనుపాతేన దశాయాం తద్గతం భవేత్.

ఫలములు నక్షత్రదశల ప్రకారం వివరించబడును. వింశోత్తర శత దశా పద్ధతిని ఇచట గ్రహించవలెను. అష్టోత్తర శత దశాపద్ధతి కాదు.

కృత్తికతో ప్రారంభించి జన్మ నక్షత్రం వరకూ అయిన సంఖ్యను తొమ్మిదితో భాగించిన శేషసంఖ్య ఆగ్రహ దశ అగును. రవి దశకు ఆరు, చంద్ర పది, కుజ 7, రాహువు 18, గురువు 16, శని 19, బుధుడు 17, కేతువు 7, శుక్రుడు 20 మొత్తం 120 సంవత్సరాలు.

ఇది సంపూర్ణమని చెప్పబడును. జన్మకాల మందలి నక్షత్రము దానికైన గ్రహదశను తెలుసుకుని (అనాటి పంచాంగము నుండి) జన్మించుటకు పూర్వము భుక్తమైన దానిని విడిచి శేషమును అనుపాత పద్ధతిలో తెలుసు కొనుము.

(వరాహమిహిరుడు తెలిపిన పద్ధతికాక అష్టోత్తర పద్ధతి కూడ ఉంది. ఇందు మరల రెండు పద్ధతులున్నాయి కృత్తికతో ప్రారంభమయ్యేది– ఆర్ద్రతో ప్రారంభమయ్యేది).

వింశోత్తరి పద్ధతి ఈ క్రింది పట్టిక ద్వారా ఇలా తెలుసుకోవచ్చు:

| | | | | |
|---|---|---|---|---|
| కృత్తిక | ఉత్తర | ఉత్తరాషాఢ | రవిదశ | 6 సం |
| రోహిణి | హస్త | శ్రవణము | చంద్రదశ | 10 సం |
| మృగశిర | చిత్ర | ధనిష్ఠ | కుజదశ | 7 సం |
| ఆర్ద్రా | స్వాతి | శతభిషము | రాహుదశ | 18 సం |
| పునర్వసు | విశాఖ | పూర్వాభాద్ర | గురుదశ | 16 సం |
| పుష్యమి | అనూరాధ | ఉత్తరాభాద్ర | శనిదశ | 19 సం |
| ఆశ్రేష | జ్యేష్ట | రేవతి | బుధదశ | 17 సం |
| మఖ | మూల | అశ్విని | కేతుదశ | 7 సం |
| పుబ్బ | పూర్వాషాఢ | భరణి | శుక్రదశ | 20 సం |

ఈ ప్రకారం చూచిన మూడు నక్షత్రాలలో ఏ నక్షత్రమైనను ఒకే దశ అగును. జనన కాలమునకున్న నక్షత్రమేదో దానికి చెప్పిన దశ తెలుసుకుని అందు జనన సమయంకు ఎంత భుక్తి అయినది-ఎంత శేషమున్నది తెలుసుకుని దాని ననుసరించి తర్వాత దశలు పైపట్టికలో చూపిన క్రమములో తెలుసుకొనవలెను.

దశాంతర్దశా చైవ మంతరాంతర్దశా తథా
సూక్ష్మ భుక్తిః ప్రాణదశా చైవం పంచదశా స్మృతాః

దశ అంతర్దశ అంతరాంతర్దశ సూక్ష్మ దశ ప్రాణ దశ అని అయిదు దశలు. వీటిని తెలుసుకొను పద్ధతి పైన తెలుపబడినది.

దశాబ్దాః స్వస్వమానేన హతాః ఖార్కోద్ధృతాః ఫలం
అంతర్దశా భవేదేవ ప్రత్యన్తర దశాదయః
ఆదావన్తర్దశా పాకపతే స్తత్క్రమతో ఉపరాః
ఏవం ప్రత్యన్తరాదౌచ క్రమోజ్ఞేయో విచక్షణైః

ఒక గ్రహదశలో మరొక గ్రహభుక్తి తెలుసుకొనుటకు ఆ రెండు గ్రహములకు తెలిపిన దశా సంవత్సరముల లబ్ధమును మొత్తమన్ని గ్రహముల దశల మొత్తముచే భాగించిన భుక్తి ప్రమాణము వచ్చును. ఆ భుక్తి ప్రమాణమును మరల కావలసిన గ్రహదశ సంవత్సరములచే గుణించి మొత్తము గ్రహదశల సంఖ్యచే భాగించిన అంతరాంతరము వచ్చును. అట్లే మరల మరల చేసి ప్రాణ—సూక్ష్మదశల వరకు లెక్కగట్టవలెను.

జన్మాద్యుడు దశా శిష్టా మారభ్యైవ శుభా ఉశుభమ్
ఫలం భవతి జాతానాం యావత్ప్రబల మారకమ్

జనన కాలమందలి నక్షత్ర దశాశేషంతో ప్రారంభమై ప్రబల మారక గ్రహదశ పర్యంతం శుభాశుభ ఫలములుండును.

ఈ ప్రకారము జన్మనక్షత్రమును బట్టి దశాంతర్దశలు తెలుసుకొనుటకు అనేక నూతన సాధనములు కలవు. అందుమూలముగ సులభముగ తెలుసుకొనవచ్చు.

## పరాశర హెూరాయా ముడుదశా జ్ఞాతవ్య మిదమ్

పరాశర హెూర యందలి నక్షత్ర దశను ఈ విధముగ తెలుసు కొనుము.

నక్షత్ర దశ అయినందున ఇచట నక్షత్ర మానము ప్రకారము గ్రహదశలు గ్రహించవలెను. నక్షత్రమానం ప్రకారం 27.321 రోజులు ఒక నెల. అటువంటి 12 నెలల చొప్పున ఒక సంవత్సరం అగును. ఆటువం టివి 120 సంవత్సములు మొత్తము.

దీనిని గ్రెగేరియను కాలెండరుకు మార్చుకొనినచో 108 సంవత్స రములగును.

$27.321 \times 12 = \frac{327.852 \times 6}{365.24}$ రవి దశ ; $\frac{327.852 \times 10}{365.24}$ చం

$\frac{327.852 \times 7}{365.24}$ కుజ కేతు $\frac{327,852 \times 18}{365.24}$ రాహు $\frac{327.852 \times 16}{365.24}$ గురు

$\frac{327.852 \times 19}{365.24}$ శని $\frac{327 \times 852 \times 17}{365.24}$ బుధ $\frac{327.852 \times 20}{365.24}$ శుక్ర



# సాధారణ సంజ్ఞలు

అథాపరం ప్రవక్ష్యామి భావానాం సంజ్ఞా విశేషమ్

అనంతరము ఇటుపై భావముల యొక్క విశేష సంజ్ఞలు తెలుపుదును.

జన్మకాలం స్ఫుటం జ్ఞాత్వా లగ్నం నిశ్చిత్య పండితైః
తస్మిన్కాలే యుతః ఖేటాయాన్తి దృగ్గణితైకతాం

పండితులు ముందుగ జనన కాలము స్ఫుటము తెలుసుకుని లగ్న నిర్ణయము చేసి ఆ సమయమునకున్న గ్రహములను దృగ్గణితమువలన సాధించినవి నిర్ణయించవలెను.

వీటికి కూడ నేడు నూతన పద్ధతులు గలవు.

శీర్షాననే తదా బాహూ హృత్క్రోడ కటి వస్తయః
గుహ్యోరు యుగళే జానుయుగ్మేవై జంఘికే తథా
చరణౌ ద్వౌ జ్ఞేయా జన్మ లగ్నాది క్రమేణైవచ

జన్మ లగ్నము నుండి ప్రారంభించి వరుసగా శిరసు, ముఖము, బాహువులు, హృదయము, వక్షము, కటి, పొత్తికడుపు, మర్మస్థానము, తొడలు, మోకాళ్ళు, పిక్కలు, పాదములు, అని పన్నెండు భావములగును.

సూర్యో గురుః కుజః సోమో గురుర్జ్ఞశ్చ శితశ్శనిః
గురు చన్ద్రేజ్య మన్దాశ్చ క్రమశో భావకారకాః.

సూర్యుడు గురువు కుజుడు చంద్రుడు గురువు బుధుడు శుక్రుడు శని గురువు బుధుడు శుక్రుడు శని గురువు చంద్రుడు గురువు శని క్రమముగ పై తెలిపిన భావములకు కారకులగుదురు.

జన్మ లగ్నాత్తను ధన సహజ బంధు పుత్రారి
కళత్ర మాయు ర్భాగ్యంచ కర్మాయ వ్యయశ్చ భావాః

లగ్నము మొదలు తను ధన సోదర బంధు పుత్ర శత్రు కళత్రం ఆయువు భాగ్యం కర్మ ఆయ వ్యయ భావములగును.

దేహం రూపంచ జ్ఞానంచ వర్ణంచైవ బలాబలం
స్థితిం సపత్తిః స్వభావం లగ్న భావాన్నిరీక్షయేత్

లగ్నభావం వలన– తనువు రూపం జ్ఞానం వర్ణం బలాబలము స్థితి సంపత్తు స్వభావం తెలుసుకొనవలెను.

ధనం ధాన్యం కుటుంబశ్చ వాక్పటుత్వ మృత్యుజాలం
ధాతురత్నాః సప్యనేత్రం ధనస్థానాన్నిరీక్షయే

ధనభావం వలన ధనం ధాన్యం కుటుంబం వాక్పటుత్వం మృత్యువు ధాతువులు రత్నములు కుడి కన్ను తెలుసుకొనుము.

సహజం విక్రమం కష్టం సవ్యకర్ణ మాభరణం
ఉపదేశం ప్రయాణమాయుః తృతీయాన్నిరీక్షయేత్

తోబుట్టువు పరాక్రమం కష్టం కుడి చెవి ఆభరణం ఉపదేశం ప్రయాణం ఆయుష్షు తృతీయ భావం వలన తెలుసుకొనవలెను.

మాతరం వాహనం బంధు సుఖం సింహాసనం గృహం
నిధినిక్షేపం చ క్షేత్రం చతుర్థా త్పరిచిన్తయేత్

తల్లి వాహనం బంధువులు సుఖం సింహాసనం ఇల్లు నిధి రహస్యముగ దాచబడినది వ్యవసాయ భూములు చతుర్థ భావమువలన తెలుసుకొన గలరు.

యన్త్ర మన్త్రో మాతులం విద్యాబుద్ధిః దేవతాభక్తిః
సంతతి రుత్తమామ్ హృదయం పంచమా ద్విచిన్తయేత్.

యంత్రములు మంత్రములు మేనమామ విద్య బుద్ధి దైవభక్తి సంతానం ఉత్తమ హృదయం పంచమం వలన తెలుసుకొనగలరు.

ఋణం జ్ఞాతిం బలం రోగముదరం శత్రుమేవచ
భిక్షాదాన మకాల భోజనం షష్ఠ భావాద్విచిన్తయేత్

ఋణము జ్ఞాతి బలం రోగం ఉదరం శత్రువులు భిక్ష అకాలభోజనం షష్ఠభావం వలన తెలుసుకొనగలరు.

కళత్రం భోగం ఛత్రం వాణిజ్యంచ ప్రయాణం తథా
గుదం మారకంచైవ జాయా భావాన్నిరీక్షయేత్

కళత్రం భోగము ఛత్రము వ్యాపారం ప్రయాణం గుదస్థానం మారకం సప్తమ భావాన్నుండి తెలుసుకొనగలరు.

ఆయూరణం రిపుంచాపి దుర్గం మృతధనం తథా
గత్యనుకాదికం సర్వం పశ్యేద్రన్ధ్రాద్విచక్షణైః

ఆయుష్షు యుద్ధం శత్రువులు (పరదేశ) దుర్గములు మృతధనము (ఈ కాలములో భీమా ధనం) కోల్పోయిన దానిని తిరిగి పొందుట సమస్తం అష్టమ భావం నుండి తెలుసుకొనుము.

భాగ్యం శ్యాలంచ ధర్మంచభ్రాతృ పత్న్యాదికం తథా
తీర్థయాత్రాదికం పితృ తపస్థానాన్నిరీక్షయేత్

భాగ్యం భార్యసోదరుడు ధర్మము సోదరుని భార్య తండ్రి తపస్సు నవమ భావం నుండి తెలుసుకొనగలరు.

రాజ్యం చాకాశం వృత్తించ మానశ్చ వ్యాపారస్తథా
ప్రవాసం కర్మకీర్తిః దశమ స్థానాన్ని రీక్షయేత్

అధికారం వ్యోమం వృత్తి ఆత్మగౌరవం వ్యాపారం ప్రవాసం పని కీర్తి మొదలైనవి దశమ భావం నుండి గ్రహించవలెను,

లాభం చాగ్రజం వామకర్ణం పుత్రజాయాది కస్య
ఆయం వృద్ధిం పశూనాంచ భవస్థానాన్ని రీక్షయేత్

లాభం జ్యేష్ఠసోదర సోదరీలు ఎడమచెవి కోడలు రాబడి వృద్ధి పశువులు ఏకాదశ భావం నుండి తెలుసుకొనగలరు.

వ్యయంచ వైరివృత్తాంతం రిఫః నాశం నరకం తథా
వామనేత్రం శయ్యా కారాగార మన్యా న్నిరీక్షణం

వ్యయం శత్రువుల స్థితి చెడుట నాశనం నరకం ఎడమకన్ను శయ్య కారాగారం వ్యయ భావం వలన తెలుసుకొనగలరు.

లగ్న పంచమ నవమాః శుభ సంజ్ఞాః కోణాః స్మృతాః *
పంచమో నవమ స్తత్ర విశేషేణ శుభప్రదౌ
లగ్నం చతుర్థం దశమం సప్తమం కేంద్రాః ఖ్యాతాస్తు
తేషాంమధ్యే శుభౌ ప్రోక్తౌ కర్మ బంధూ సుఖప్రదౌ
తథా చత్వారో భావయో యోగప్రదాః కేంద్రకోణాః
త్రిమదాయాశ్చ ఖ్యాతాఃపాపాః ద్వితీయ ముదాసీనం
షష్ఠాష్టవ్యయభావాశ్చా ఽశుభ సౌంజ్ఞా త్త్రికాః స్మృతాః
త్రిషడాయా ఽఽన్యద్దైశ్చ ప్రోక్తాః ఉపచయ సంజ్ఞికాః

లగ్నం పంచమము నవమము శుభభావాలు కోణాలు అని పిలువబడును. అందులో పంచమ నవమ భావాలు రెండూ మిక్కలి శుభమునిచ్చేవి.

లగ్నం చతుర్థం దశమం సప్తమం కేంద్రాలని చెప్పబడును. వాటి మధ్యనున్న చతుర్ధ దశమ భావాలు రెండూ శుభమని చెప్పబడును సుఖము నిచ్చునవి. ఆ ప్రకారం నాలుగు భావాలు కేంద్రకోణాలు యోగమునిచ్చునవి.

తృతీయ సప్తమ లాభ భావాలు పాపాలని చెప్పబడును. ద్వితీయం ఉదాసీనము (అనగా శుభం పాపంచేయని).

షష్ఠా అష్ట వ్యయ భావాలకు త్రికములని పేరు. అశుభమైనవి. (శుభం చేయనివి అని అర్థము).

---

* లగ్నతుర్యాస్త వియతాం కేంద్రసంజ్ఞా విశేషతః
ద్విపంచరంధ్ర లాభానాం జ్ఞేయం పణఫరాభిదమ్
త్రిషష్ఠ భాగ్య రిఫ్ఫానామా పోక్లిమం ప్రోక్తం కేచిత్
లగ్న పంచమ భాగ్యానాం కోణ సంజ్ఞా విధీయతే
షష్ఠాష్టవ్యయ భావానాం దుస్సంజ్ఞాస్త్రిక సంజ్ఞికాః
స్వస్థా దుపచయ స్థాణి త్రిషడాయాంబరాణి.

మూడు ఆరు పదకొండు పది భావములకు ప్రత్యేకముగ ఉపచయ ములు అని పేరు (ఆధిక్యము గలవి).

దీనిని కొంచెము సూక్ష్మంగ పరిశీలించిన; మొత్తం ద్వాదశ భావాలను రెండు ప్రధాన వర్గాలుగ విభజించెను. బేసి భావాలు ఆరు. సరి భావాలు ఆరు. మరల ఒక్కొక్క వర్గంను రెండు భాగాలు శుభ–పాప అనువానిగ విభజంచెను. బేసి భావాలు ఆరింటిలో లగ్న (1) పంచమ (5) నవమ (9) భావములు మూడున్ను శుభమైనవి. సప్తమ (7) లాభ (11) తృతీయ (3) భావాలు మూడున్ను పాపమైనవి. శుభ భావాలకు పాప భావాలు క్రమంగా సప్తమ భావాలగును.

సరి భావాలలో ఆరు ఎనిమిది పన్నెండు త్రికములను అశుభ భావాలు. నాలుగు పది భావాలు సుఖమునిచ్చు భావాలు. రెండు ఉదాసీనము. అయితే త్రికములు శుభమునీయవు. అంటే పాపము చేయునని అనుకోరాదు.

పై తెలిపిన దాంట్లో కేంద్రాలు రెండు, కోణాలు రెండు అనగా చతుర్థ దశమ పంచమ నవమ భావాల వలన సుఖము గలుగునని తెలిపాడు. కేవలము తృతీయ సప్తమ ఏకాదశములు మాత్రమే పాపమైనవని తెలిపాడు.

లగ్న ముదయసంజ్ఞిత మేకాదశం లాభ స్తథా
ద్వితీయం సప్తమం చైవ తద్ద్వయం మారకాహ్వయమ్
తృతీయ మష్టమం చైవ తద్ద్వయం హ్యాయురాహ్వయమ్
చతుర్థ దశమౌ ప్రోక్తౌ రమాఖ్యౌ సుఖదాయకౌ
పంచమ నవమౌ ప్రోక్తౌ విష్ణ్వాఖ్యౌ శుభదాయకౌ
షష్ఠం ఋణసంజ్ఞికం వ్యయసంజ్ఞికంతు ద్వాదశమ్.

ఉదయించునది లగ్న భావం; లాభంను కూర్చునది ఏకాదశ భావం ద్వితీయ సప్తమ భావాలు రెండున్నూ మారకం నిచ్చునవిగ చెప్పబడును. తృతీయ అష్టమ భావాలు ఆయుర్భావాలు చతుర్థ దశమ భావాలు రెండూ లక్ష్మీస్థానములు- సుఖమునిచ్చునవి. పంచమ నవమ భావాలు రెండున్ను విష్ణు స్థానాలు శుభమును కూర్చునవి. షష్ఠభావం ఋణం కూర్చును, ద్వాదశ భావం వ్యయం చేయును.

ద్వాదశ భావాల యొక్క వివరణ ఇంత విపులంగా ఇతర ఋషులచే చెప్పబడలేదు.

కారకత్వం ఖగానాంచ భావానామపి సంగ్రహాత్
ఆధిపత్యం స్థితిం దృష్టిం యోగం జ్ఞాత్వా ఫలంవదేత్.

గ్రహాల భావాల కారకత్వాలు క్షుణ్ణంగా తెలుసుకుని భావాధిపత్యం భావస్థితం గ్రహదృష్టి గ్రహములయుతి వీనిని తెలుసుకుని ఫలములను చెప్ప వలెను.

గ్రహాలకు భావకారకత్వం వలన శుభ పాప పలములుండును; అలాగే గ్రహాలకు వేరువేరు కారకత్వాలు భావాలకు వేరువేరు కారకత్వాలు ముందు తెలుపబడినవి. వాటిని పురస్కరించుకొనియు శుభ పాపభావాలందు స్థితిని బట్టియు అటులే శుభ గ్రహం పాపగ్రహంను చూచుట లేదా పాపగ్రహం శుభ గ్రహంను చూచుట వలననూ. శుభ గ్రహంను శుభ గ్రహం చూచుట పాప గ్రహంను పాపగ్రహం చూచుట— అటులనే శుభ-పాప గ్రహాల యుతి-శుభ గ్రహంతో శుభ గ్రహం యుతి పాపగ్రహంతో పాపగ్రహం యుతి ఈ మొద లైనవి పరీక్షించి ఫలితాలను చెప్పవలెను.

అయితే ఆ శుభ పాప వ్యత్యాసం ఎటుల తెలుసుకొనవలెనో ఇటుపైని చెబుతున్నాడు. అనగా ఇచట ముఖ్యంగా తెలుసుకొనదగినది ఏ గ్రహం శుభమైనది-ఏ గ్రహం పాపమైనది తెలుసుకొనవలెను. ఇది ఆధిపత్యంను బట్టి ఉండును.



# ఆయుర్భావము

తతయేవ స్ఫుటకార్యా దిక్కాలౌచ స్ఫుటీ విదా
పూర్వమాయుః పరిక్ష్యైతా పశ్చా ల్లక్షణమేవచ

లగ్న స్ఫుటం గ్రహ స్ఫుటం మొదలైనవి అయిన తర్వాత ముందుగా ఆయుర్భావంను పరీక్షించవలెను. తర్వాత శుభాశుభ లక్షణాలు అన్ని పరీక్షించవచ్చు—

ఆయుర్భావం నిర్ణయించినచో అనంతరం శుభాశుభ యోగాలు చూడవచ్చు. అసలు జాతకంలో ఆయుర్భావం బాగులేకున్న ఇతర ఫలాలు యోచించి ఏం ప్రయోజనం.

అష్టమం హ్యాయుషః స్థాన మష్టమాదష్టమం తథా
తయోరపి వ్యయసానం మారక స్థానముచ్యతే
తత్రాపి అద్య వ్యయస్థానా దుత్తరం బలవత్తరమ్

అష్టమ భావం అష్టమంనకు అష్టమం (తృతీయం) ఆయుస్థానాలు. వాటి వ్యయస్థానాలు అనగా అష్టమంకు వ్యయస్థానం సప్తమం, తృతీయంకు వ్యయస్థానం ద్వితీయం. అందువలన సప్తమ ద్వితీయ భావాలు మారక స్థానాలు. అందులో ముందు తెలిపిన సప్తమం తర్వాత తెలిపిన ద్వితీయం కన్న బలవత్తరమైనది. అష్టమ తృతీయాలు ఆయుస్థానాలు—సప్తమ ద్వితీయములు మారక స్థానాలు.

తదీశతుః తత్రగతాః పాపినః తేన సంయుతాః
తేషాం దశావిపాకేషు సంభవే న్నిధనం నృణామ్
తేషా మసంభవే సాక్షా ద్వ్యయాధీశ దశాస్వపి
అలాభే పునరేతేషాం సంబంధేన వ్యయేశితుః

ఆ సప్తమ, ద్వితీయ భావాధిపతుల దశలలోను లేదా ఆ సప్తమ–ద్వితీయ భావంలందున్న గ్రహాల దశలలోను లేదా ఆ సప్తమ ద్వితీయ భావాధిపతులతో చేరిన పాపుల దశలలోను మరణం సంభవించును. ఆ

తెలిపిన గ్రహాల దశలు సంభవించని పక్షంలో ఆ ప్రకారంగ గ్రహాలుండనిచో ప్రత్యక్షంగ వ్యయాధిపతి దశలో జరగవచ్చు. ఒకవేళ అదియు కానిపక్షంలో వ్యయాధిపతితో సంబంధమున్న గ్రహం లేదా వ్యయమందున్న గ్రహం దశలలో మరణం సంభవించును.

క్వచిచ్ఛుభానాంచ దశా స్వే తేషు సంబంధేనచ
చంద్రభానూ వినా సర్వే మారకాః మారకాధిపాః
కేవలానాంచ పాపానాం దశాసు నిధనం క్వచిత్
కల్పనీయం బుధైః నృణాం మారకాణామదర్శనే.

పై తెలిపిన మారకులతో సంబంధమున్న శుభుల దశలలో ఒకప్పుడు మారకం జరుగవచ్చు. మారకాధిపత్యం గల రవి చంద్రులు తప్ప తక్కిన అన్ని గ్రహములు మారకులగుదురు. కేవలముగ పాపుల దశలైనను (అధిపత్య పాపులు) మారకము నిచ్చును. ఆ ప్రకారముగ మారక గ్రహములు తెలియనపుడు బుద్ధిమంతులైనవారు మారకులను ఊహించి పై తెలిపిన వానిని బట్టి నిర్ణయించవలెను.

మారకైస్సహ ఉసంబంధా న్నిహంతా పాపకృ చ్ఛనిః
అతిక్రమ్యేతరాన్ సర్వా న్భవత్యేవ నసంశయః

పాపియైన శని (అనగా తృతీయ సప్తమ లాభాధిపత్యము గల శని) మారక గ్రహముతో సంబంధము లేకున్ననూ అందర్నీ అతిక్రమించి మారకము చేయును.

ఆ ప్రకారంగ సప్తమ ద్వితీయ వ్యయాధిపతులు. ఆయా భావములందున్న గ్రహములు ఆయా భావాధిపతులతో యుతి పొందిన గ్రహములు ఒకప్పుడు కేవలం పాపుల దశలలోను లేదా అన్ని మారక గ్రహములను అతిక్రమించి కేవల పాపియై శనియే మారకము నిచ్చును అని తెలిపాడు.

అయితే ఆ మారక కాలము ఎప్పుడు అనునది ముందుగ నిర్ణయించి ఆ సమయముకు పై తెలిపిన గ్రహదశలు ఉండునా అనునది గ్రహించి మారకుని నిర్ణయించవలెను. తర్వాత అటువంటి సమయము ఎప్పుడు సంభవించునో తెలుపుతున్నాడు.

సమ్యోరిష్టం రిష్టః కేచిద్బాల గ్రహైరపి తథా
త్రివిధా బాలమృత్యుదాః అద్వాదశాబ్దంత్వ పరే
త్రివిధా శ్చాయుషో యోగా స్వల్పాయుర్మధ్యమో త్తమాః

మరణించిన శిశు జననం (Still born) జననమందిన కొద్దిరోజులలో మరణించుట, కొన్ని బాలగ్రహ దోషముల వలన మరణం అనునవి మూడు విధములైన బాల్య మరణములు పన్నెండు సంవత్సరముల వరకు ఉండును. పండ్రెండు సంవత్సరాలకు పైన ఆయుర్భావం మూడు విధాలు. అవి అల్ప మధ్యమ ఉత్తమమని మూడు విధాలు.

ద్వాత్రింశత్పూర్వ మల్పాయు ర్మధ్యమాయు స్తదోత్తరే
ఆసప్తతి స్తదూర్ధ్వంతు దీర్ఘాయు రితి సమ్మతమ్

ముప్పది రెండు సంవత్సరాల పూర్వం అల్పాయువు ఆపైన డెబ్బది సంవత్సరాల వరకు మధ్యమాయువు. ఆ పైన దీర్ఘాయుఃవు-ఇది సమ్మత మైనది.

అయితే యీ అల్ప మధ్యమోత్తమములు మూడు విధాలు మరల ఒక్కొక్కటి మూడు వర్గాలుగ విభజింపబడినవి. ఇందు అల్పాయువనగ పన్నెండు నుండి ముప్పది రెండు వరకు మధ్యమాయువనగ ముప్పది మూడు నుండి డెబ్బది వరకు ఉత్తమాయువనగ డెబ్బది సంవత్సరాల పైన.

అల్పాయు రల్పమధ్యాయుః పూర్ణాయుః త్రివిధం స్మృతమ్
మధ్యంబాల్ప మధ్యంచ పూర్ణాయు స్త్రివిధమ్ స్మృతమ్
దీర్ఘాయు శ్చాల్ప మధ్యేచ పూర్ణాయు స్త్రివిధమ్ స్మృతమ్
ఏవం నవవిధం ప్రోక్త మాయుషాంతు వినిర్ణయః

అల్పాయువు అల్ప మధ్యమ పూర్ణమని మూడు విధములు అనగా అల్పాల్ప అల్పమధ్యమ అల్పదీర్ఘకమని. మధ్యమాయువు మధ్యాల్ప మధ్య మధ్య. మధ్యపూర్ణమని. పూర్ణాయుఃవు పూర్ణాల్ప పూర్ణమధ్యమ పూర్ణపూర్ణమని మొత్తం ఈ ప్రకారంగ తొమ్మిది విధాలు ఆయుర్దాయం.

వీటికి ముందు అనగా పన్నెండు సంవత్సరాల వరకూ చెప్పినవి మూడు విధాలు. ఆ ప్రకారంగా మొత్తం పన్నెండు విధాలుగ నిర్ణయించవచ్చు ఆయుర్భావమును.

గోచార దోషకలితా బాలారిష్ట సమన్వితా
అనిష్టయోగ యుక్తాచ దశాద్యా ప్రాణనాశినీ

జననముతో ప్రారంభమయ్యే గ్రహదశ (ముందుతెలిపిన ఉడుదశా పద్ధతిని)* గోచారదోషము కలదైనను—బాలారిష్టముతో కూడినదైనను (పైన తెలిపిన పద్ధతి) పాపగ్రహముల యుతి పొందిన దైననూ, ఆ ప్రారంభదశ లోనే మరణము సంభవించవచ్చు—

పాపగ్రహ దశారంభే మారకత్వేప లక్షితా
అనిష్టయోగ సహితా నాశినీ విషమదశా.

మారక లక్షణములు గలిగిన పాప (ప్రతీప) గ్రహదశ అనిష్ట యోగ ముతో కూడినదై పాపులతో యుతి పొందినదైన వేసి దశయైనచో అట్టి దశ ప్రారంభములోనే మారకము నిచ్చును.

మారక లక్షణములు గలిగిగాని, మారక గ్రహముతో యుతి పొంది గాని యున్న పాపగ్రహదశ వేసి దశ అయినచో అట్టి దశ ప్రారంభంలోనే మారకము నిచ్చును.

---

గోచారము :

జన్మనక్షత్ర మారభ్య నిత్యభాంతం గణ్యతే
నవసంఖ్యా హృతం భాగం నవతారాః ప్రకీర్తితాః
జన్మ సంపద్విపత్ క్షేమ ప్రత్యక్సాధన నైధనమ్
మిత్రం పరమ మిత్రంచ నవతారాః ప్రకీర్తితాః
జన్మనో దేహనాశాయ సంపత్సంపద మేవచ
విపదో ధననాశంచ క్షేమం క్షేమకరోభవేత్
ప్రత్యక్కార్యవినాశాయ సాధనే కార్యసాధనమ్
నైధనే నిధనం చైవ మిత్రేచ సుఖసంపదా
పరమమైత్రే అర్థలాభం స్యాత్తారాబలం క్రమాత్.

శుభగ్రహ దశారంభే మారకత్వ సమన్వితా
దశా కష్టకరీచ జ్ఞేయా నాశినీ యుగ్మదశా

మారక గ్రహముతో యుతి పొందిన శుభగ్రహ దశ కష్టములు కలిగించును-అట్టి శుభగ్రహ దశ (కోణాధిపతి దశ) సరిదశ అయినచో ఆ దశ ప్రారంభంలోనే మారకము నిచ్చును.

ఇచట శుభపాపములు అనునవి ఆధిపత్యము ననుసరించి నిర్ణయించవలెను

ఆయుర్యోగ బలోపేతా శుభ దృష్టి సమన్వితా
పాప గ్రహదశా జ్ఞేయా దుష్టాఽ ప్యప్రాణనాశినీ

పాపగ్రహ దశ (ప్రతీపగ్రహము) దుష్టమైనదైనప్పటికి (పైన తెలిపిన నవవిధ ఆయుర్యోగముల ప్రకారం) ఆయుర్యోగం బలమైన దైనట్లయితే అట్టి పాపగ్రహమును శుభగ్రహం చూచినందున ప్రాణహాని జరుగదు-

శుభ ద్వయ దశామధ్యే యది పాపదశా భవేత్
తస్యాం నప్రాణహాని స్స్యాదశుభం నాఽధికంభవేత్

రెండు శుభగ్రహముల దశల మధ్య (కోణాధిపతుల మధ్య) ఒక పాపగ్రహము యొక్క దశ ప్రతీపాధిపతి దశ వచ్చినచో అది ప్రాణహానిని కలిగించదు సరికదా అశుభ ఫలములు కూడ అధికముగ నివ్వదు.

పాపద్వయ దశామధ్యే కాచిచ్ఛుభ దశాయది
పాపానురూపిణీ భూయాన్నై వోక్త శుభదాభవేత్

రెండు పాపగ్రహముల దశల మధ్య ఒక శుభగ్రహము యొక్క దశ వచ్చినచో ఆ శుభగ్రహ దశయందు దానికి చెప్పబడిన శుభము విశేషించి ఇవ్వదు-

దశాభిద్రేషు కాలేషు మారకో మరణప్రదః

మారకగ్రహదశలో ఆదశ ఆఖరులో మరణమునిచ్చును.

ధ్రువమేవం వినిశ్చిత్య ప్రబలం మారకం తథా
నిరుక్తం స్థూలదృష్ట్యైవ సూక్ష్మదృష్ట్యా విచారయేత్

(పైతెలిపిన) అంశములన్నియు జాగ్రత్తగ పరిశీలించి ప్రబలమారకుని నిర్ణయించవలెను. అయితే స్థూలదృష్టితో ఏ నిర్ణయము చేయరాదు. సూక్ష్మంగా అన్నీ పరిశీలించి అప్పుడు నిర్ణయించవలెను.

ఫలాని గ్రహచారేణ సూచయన్తి జాతకేభ్యః
కోవక్తా తారతమ్యస్య తమేకం వేదసం వినా

ఫలములను గ్రహముల గమనము ననుసరించి సూచించడమైనది-కాని ఎక్కువ తక్కువల గురించి ఎవరు చెప్పగలరు. సృష్టికర్త బ్రహ్మ మాత్రమే చెప్పగలడు.



## శుభులు-పాపులు (ఆధిపత్యం వలన)

ప్రతిలగ్నం సమాలక్ష్య పూర్వోద్దిష్టా ఒవిరోధతః
తత్తద్గ్రహ స్వరూపాణి క్రమేణైవ వివృణ్మహే..

ప్రతిలగ్నమును చక్కగ పరిశీలించి ముందు తెల్పిన విషయములకు విరుద్ధముగాకుండ ఆయాగ్రహాల స్వరూపములు క్రమముగ వివరించెదను.

మన్ద సౌమ్య సితాః పాపాః శుభౌ గురు దివాకరౌ
కవి స్సాక్షాన్నహన్తా స్యాన్మారక త్వేపి లక్షితః
మన్దాదయో నిహంతారో భవేయుః పాపినోగ్రహాః
శుభాశుభ గ్రహాన్యేవం జ్ఞాతవ్యాని క్రియాభువః

మేషలగ్నమునకు శని (10-11 భావాధిపతి బుధ (3-6 భావాధిపతి) శుక్ర (2-7 భావాధిపతి) పాపులు-గురువు (9-12 భావాధిపతి) రవి (5వ భావాధిపతి) శుభులు-శుక్రుడు (ద్వితీయ సప్తమ భావముల మారకాధిపత్యము) మారకము నీయడు – శని మొదలైన పాపులు మారకులు అగుచున్నారు. శుభాశుభ గ్రహములను ఈ విధముగ నిర్ణయించవలెను

జీవ వక్రేన్దవః పాపాః శుభౌ బుధ రవిసుతౌ
బుధస్సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేన లక్షితః
భూసుతాదయశ్చ పాపాః ఘ్నన్తి మారకలక్షణాః
బుధైస్తత్ర త్ఫలాన్యేవం జ్ఞేయాని వృషజన్మనః

వృషభలగ్నమున జన్మించిన వారలకు గురు (8–11) కుజ (7–12) చన్ద్ర (3) పాపులు-శుభులు బుధ (2·5) శని (9–10). బుధుడు (ద్వితీయ మారక స్థానాధిపతియైనను) ప్రత్యక్షముగ మారకము చేయడు. కుజాది పాప గ్రహములు మారకం నిచ్చును. ఆ విధంగ వృషభలగ్నమునకు శుభాశుభులను తెలుసుకొనుము.

భౌమ జీవారుణాః పాపాః శుభౌ శుక్రాంశుమత్సుతౌ
విధు స్సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేన లక్షితః
జీవాదయో నిహంతారో భవేయుః పాపినో గ్రహాః
శుభాశుభ ఫలం జ్ఞేయ మిత్థంహి యుగ్మజన్మనః

కుజ (6–11) గురు (7-10) రవి (3) పాపులు-శుభులు శుక్రుడు (5-12) శని (8-9). చంద్రుడు ద్వితీయ మారకాధిపతియైనను ప్రత్యక్షముగ మారకము చేయడు. గురువు మొదలైన పాపులు మారకము నిత్తురు-మిథున లగ్నమందు జనించిన వారికి శుభాశుభ గ్రహాలనిట్లు తెలుసుకొనుము.

భృగు మన్ద సౌమ్యాః పాపాః భూసుతాంగిరసౌ శుభౌ
రవి స్సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేన లక్షితః
సౌమ్యాదయో నిహంతారో భవేయుః పాపినో గ్రహాః
కర్కాలగ్నోద్భవ స్యైవం ఫలాన్యూహ్యాన్ని సూరిభిః

శుక్ర (4-11) శని (7-8) బుధ (3-12) పాపులు-కుజ (5–10) గురు (6–9) శుభులు. రవి ద్వితీయ మారక స్థానాధిపతియైనను మారకము నీయడు. బుధుడు మొదలైన పాపులు మారకులగుదురు. కర్కాటక లగ్నమందు జనించిన వారల శుభాశుభ గ్రహముల నిట్లు తెలుసుకొనవలెను.

మన్ద సౌమ్య సితాః పాపాః వక్రజీవౌ శుభావహౌ
శని స్సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేన లక్షితః
ఘ్నన్తి సౌమ్యాదయః పాపాః మారకలక్షణత్వేన
సింహ లగ్నోద్భవస్యైవం ఫలాన్యూహ్యాని సూరిభిః

శని (6–7) బుధ (2-11) శుక్ర (3-10) పాపులు. కుజ (4–9) గురు (5–8) శుభులు. శని సప్తమ మారక స్థానాధిపతి అయినను ప్రత్యక్షముగ మారకము నీయడు. బుధుడు మొదలగు పాపులు మారకులగుచున్నారు-సింహాలగ్న మందు జన్మించినవారి ఫలములు ఈ విధముగ తెలుసుకొనుము.

కుజ జీవేన్దవః పాపాః శుభౌ శుక్రచ్ఛాయాసుతౌ
కవి స్సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేన లక్షితః
జీవాదయో నిహన్తారో భవేయుః పాపినో గ్రహాః
జ్ఞాతవ్యాని ఫలాన్యేవం కన్యాలగ్నోద్భవ స్యహి

కన్యాలగ్నమందు జన్మించినవారలకు కుజ (3-8) గురు (7–4) చన్ద్ర (11) పాపులు-శుక్ర (2-9) శని (5-6) శుభులు. శుక్రుడు ద్వితీయ మారక

స్థానాధిపతి అయినను ప్రత్యక్షంగ మారకం నీయడు. గురువు మొదలైన గ్రహాలు మారకులు అని శుభాశుభుల నిట్లు తెలుసుకొనుము.

జీవార్కభూసుతాః పాపాః శనైశ్చరబుధౌ శుభౌ
కుజః సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేన లక్షితః
జీవాదయో నిహంతారో భవేయుః పాపినో గ్రహాః
శుభాశుభ ఫలాన్యేవం జ్ఞాతవ్యాని తులా భువః

గురువు 3-6 కుజుడు 2-7 రవి 11 పాపులు. శని 4-5 9-12 శుభులు. కుజుడు ద్వితీయ సప్తమ మారక స్థానాల కధిపతియై ప్రత్యక్షంగ మారకం నీయడు. గురువు మొదలైన పాపులు మారకులన్నారు. ఈ విధంగా తులా లగ్నమందు జనించినవారికి శుభాశుభ గ్రహ నిట్లు తెలుసుకొనుము.

బుధ శుక్రార్కతనయాః పాపాః శుభౌ గురుచన్ద్రౌ
గురు స్సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేన లక్షితః
హన్తి శుక్రాదయో పాపాః మారకత్వేన లక్షితః
ఫలాన్యేతాని జ్ఞెయాని వృశ్చికోదయ జన్మనః

బుధ 8-11 శుక్ర 7-12 శని 3-4 పాపులు. శుభులు గురువు 2-5 చంద్రుడు 9. ద్వితీయ మారకస్థాన అధిపత్యం పొందిన గురువు ప్రత్యక్ష మరణం నీయడు. శుక్రుడు మొదలైన పాపులు మారకలక్షణాలుగల వారై మారకులగుదురు. వృశ్చికలగ్నమందు జనించిన వారి ఫలములనిట్లు తెలుసుకొనుము.

విత్సౌరిసితాః పాపాః శుభౌ భూసుతదివాకరౌ
శని స్సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేపి లక్షితః
సౌమ్యాదయో నిహంతారో భవేయుః పాపినోగ్రహాః
ధనుర్లగ్నోద్భవస్యైవ శుభాశుభ ఫలమిదం

బుధ 7-10 శని 2-3 శుక్ర 6-11 పాపులు-శుభులు, కుజ 5-12 రవి 9 ద్వితీయ మారక స్థానాధిపతి అయినను శని ప్రత్యక్షంగ మారక

నీయడు. బుధుడు మొదలైన పాపులయిన గ్రహాలు మారకం నిచ్చును–ధను ర్లగ్నమందు జనించిన వారి శుభాశుభ గ్రహాల నిట్లు తెలుసుకొనుము.

చన్ద్ర భూసుతాంగిరసాః పాపాః బుధశుక్రౌ శుభౌ
మారకత్వేపి లక్షితశ్చ నహంతా నిశాకరః
కుజాదయో నిహంతారో భవేయుః పాపినోగ్రహాః
బుధై రేవం ఫలాని జ్ఞాతవ్యాని మృగ జన్మనః

చన్ద్ర 7 కుజ 4–11 గురువు 3–12 పాపులు. బుధ 6–9 శుక్ర 5–10 శుభులు. మారకస్థాన అధిపతి అయినను చంద్రుడు మారకం నీయడు కుజుడు మొదలయిన పాపులు మారకులగుచున్నారు. ఈ ప్రకారంగ మకర లగ్నమందు జనించినవారికి శుభాశుభ గ్రహాలను తెలుసుకొనవలయును.

జీవార్క భూసుతా: పాపా: శుభౌ చన్ద్రజభార్గజౌ
రవి స్సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేపి లక్షిత:
జీవాదయో హంతారో భవేయు: పాపినోగ్రహా:
జ్ఞాతవ్యాని బుధై రేవం ఫలాని ఘటజన్మన:

గురువు 2-11 కుజుడు 3-10 రవి 7 పాపులు–శుభులు బుధుడు 5-8 శుక్రుడు 4–9 సప్తమ మారకస్థానంనకు అధిపతి అయినప్పటికి రవి ప్రత్యక్షంగ మారకం నీయడు. గురువు మొదలైన పాపులు మారకులగుచున్నారు. కుంభలగ్నమందు జనించినవారి ఫలము లీలాగున తెలుసుకొనుము.

బుధ శుక్రాంశుమత్సుతా: పాపా: భౌమ విధూశుభౌ
కుజ సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేపి లక్షిత:
హన్తి సౌమ్యాదయో పాపా: మారకత్వేన లక్షిత:
మీన లగ్నోద్భవస్యైవం ఫలాని పరిచిన్తయేత్

బుధుడు 7–10 శుక్రుడు 3-8 శని 11-12 పాపులు కుజుడు 2–9 చంద్రుడు 5 శుభులు. ద్వితీయ మారకస్థాన ఆధిపత్యమున్ననూ కుజుడు ప్రత్యక్షంగ మారకం నీయడు. బుధుడు మొదలైన పాపులు మారకం నిచ్చువారగుచున్నారు. ఈ ప్రకారంగ మీనలగ్నమందు జన్మించిన వారికి శుభాశుభ గ్రహములను తెలుసుకొనవలయును.

స్థానాధిపతి అయినను ప్రత్యక్షంగ మారకం నీయడు. గురువు మొదలైన పాప గ్రహాలు మారకులు అని శుభాశుభుల నిట్లు తెలుసుకొనుము.

జీవార్కభూసుతాః పాపాః శనైశ్చరబుధౌ శుభౌ
కుజః సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేన లక్షితః
జీవాదయో నిహంతారో భవేయుః పాపినో గ్రహాః
శుభాశుభ ఫలాన్యేవం జ్ఞాతవ్యాని తులా భువః

గురువు 3–6 కుజుడు 2–7 రవి 11 పాపులు. శని 4-5 బుధ 9-12 శుభులు. కుజుడు ద్వితీయ సప్తమ మారక స్థానాల కధిపతియైనను ప్రత్యక్షంగ మారకం నీయడు. గురువు మొదలైన పాపులు మారకులగుచున్నారు. ఈ విధంగా తులా లగ్నమందు జనించినవారికి శుభాశుభ గ్రహాల నిట్లు తెలుసుకొనుము.

బుధ శుక్రార్కతనయాః పాపాః శుభౌ గురుచన్ద్రౌ
గురు స్సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేన లక్షితః
హన్తి శుక్రాదయో పాపాః మారకత్వేన లక్షితః
ఫలాన్యేతాని జ్ఞెయాని వృశ్చికోదయ జన్మనః

బుధ 8–11 శుక్ర 7-12 శని 3-4 పాపులు. శుభులు గురువు 2-5 చంద్రుడు 9. ద్వితీయ మారకస్థాన అధిపత్యం పొందిన గురువు ప్రత్యక్షంగ మరణం నీయడు. శుక్రుడు మొదలైన పాపులు మారకలక్షణాలుగల వారై మారకులగుదురు. వృశ్చికలగ్నమందు జనించిన వారి ఫలములనిట్లు తెలుసుకొనుము.

విట్సౌరిసితాః పాపాః శుభౌ భూసుతదివాకరౌ
శని స్సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేపి లక్షితః
సౌమ్యాదయో నిహంతారో భవేయుః పాపినోగ్రహాః
ధనుర్లగ్నోద్భవస్యచ శుభాశుభ ఫలమిదం

బుధ 7–10 శని 2-3 శుక్ర 6–11 పాపులు–శుభులు. కుజ 5-12 రవి 9 ద్వితీయ మారక స్థానాధిపతి అయినను శని ప్రత్యక్షంగ మారకం

నీయడు. బుధుడు మొదలైన పాపులయిన గ్రహాలు మారకం నిచ్చును–ధను ర్లగ్నమందు జనించిన వారి శుభాశుభ గ్రహాల నిట్లు తెలుసుకొనుము.

చన్ద్ర భూసుతాంగిరసాః పాపాః బుధశుక్రౌ శుభౌ
మారకత్వేపి లక్షితశ్చ నహంతా నిశాకరః
కుజాదయో నిహంతారో భవేయుః పాపినోగ్రహాః
బుధైరేవం ఫలాని జ్ఞాతవ్యాని మృగ జన్మనః

చన్ద్ర 7 కుజ 4–11 గురువు 3–12 పాపులు. బుధ 6–9 శుక్ర 5–10 శుభులు. మారకస్థాన అధిపతి అయినను చంద్రుడు మారకం నీయడు కుజుడు మొదలయిన పాపులు మారకులగుచున్నారు. ఈ ప్రకారంగ మకర లగ్నమందు జనించినవారికి శుభాశుభ గ్రహాలను తెలుసుకొనవలయును.

జీవార్క భూసుతా: పాపా: శుభౌ చన్ద్రజభార్గజౌ
రవి స్సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేపి లక్షిత:
జీవాదయో హంతారో భవేయు: పాపినోగ్రహా:
జ్ఞాతవ్యాని బుధైరేవం ఫలాని ఘటజన్మన:

గురువు 2-11 కుజుడు 3-10 రవి 7 పాపులు–శుభులు బుధుడు 5-8 శుక్రుడు 4–9 సప్తమ మారకస్థానంనకు అధిపతి అయినప్పటికి రవి ప్రత్యక్షంగ మారకం నీయడు. గురువు మొదలైన పాపులు మారకులగుచున్నారు. కుంభలగ్నమందు జనించినవారి ఫలము లీలాగున తెలుసుకొనుము.

బుధ శుక్రాంశుమత్సుతా: పాపా: భౌమ విధూశుభౌ
కుజ సాక్షాన్నహంతా స్యాన్మారకత్వేపి లక్షిత:
హన్తి సౌమ్యాదయో పాపా: మారకత్వేన లక్షిత:
మీన లగ్నోద్భవస్యైవం ఫలాని పరిచిన్తయేత్

బుధుడు 7–10 శుక్రుడు 3-8 శని 11-12 పాపులు కుజుడు 2–9 చంద్రుడు 5 శుభులు. ద్వితీయ మారకస్థాన ఆధిపత్యమున్ననూ కుజుడు ప్రత్యక్షంగ మారకం నీయడు. బుధుడు మొదలైన పాపులు మారకం నిచ్చు వారగుచున్నారు. ఈ ప్రకారంగ మీనలగ్నమందు జన్మించిన వారికి శుభాశుభ గ్రహములను తెలుసుకొనవలయును.

ఈ ద్వాదశ లగ్నములకు పైన తెలిపిన శుభాశుభ గ్రహములను సూక్ష్మముగా పరిశీలించినచో అన్ని లగ్నములకు తృతీయ 3, సప్తమ 7, లాభ 11 అధిపతులు పాపులగుచున్నారు. లగ్న-1 పంచమ 5, నవ 9 మాధిపతులు శుభులగుచున్నారు.

మరొక విషయము. ద్వాదశ లగ్నములలో ఆరు లగ్నములకు రవి-చంద్ర-కుజ-గురువులు శుభులైన మిగిలిన శని-బుధ-శుక్రులు పాపులగుచున్నారు. మిగిలిన ఆరు లగ్నాలకు శని-బుధ-శుక్రులు శుభులు అయితే రవి-చంద్ర-గురు-కుజలు పాపులగుచున్నారు.

బేసి లగ్నములైన మేష-మిథున-సింహ-తులా-ధనుర్-కుంభ లగ్నములకు ద్వితీయ 2, షష్ఠ 6, దశమ 10 భావములు పాపములై చతుర్థ 4, అష్టమ 8, ద్వాదశ 12 భావములు శుభములగుచున్నవి.

సరిలగ్నములైన వృషభ-కర్కట-కన్యా-వృశ్చిక-మకర-మీన లగ్నములకు ద్వితీయ 2, షష్ఠ 6, దశ 10 మాది భావములు శుభములగుచు చతుర్థ 4, అష్టమ 8, ద్వాదశ 12 భావములు పాపములగుచున్నవి.

కోణాధిపత్యంతోకూడిన సరిరాశ్యధిపత్యం శుభం - తృతీయ సప్తమ లాభాధిపత్యములతో కూడిన సరిరాశ్యాదిపత్యం పాపం అగుచున్నది.



# విశేష సంజ్ఞలు

స్థానస్థితివశేనైవ ఫలంప్రోక్తం పురాతనై:
మిథో భావేశా స్సంబంధా త్శుభాఽశుభ ఫలం వదేత్

పూర్వులు, గ్రహములుండు స్థానంనుబట్టి ఫలములు చెప్పెడివారు. కాని భావాధిపత్యంనుబట్టి గ్రహాలమధ్య సంబంధం పురస్కరించుకొని శుభాశుభ ఫలములు చెప్పవలెను.

భావాధిపతులమధ్య సంబంధం అనగా వాటియుతి, వీక్షణలనుబట్టి శుభాశుభ ఫలములుండును—పరాశరేతర పద్ధతిలో నైసర్గిక శుభ పాపములు—మిత్రత్వ శత్రుత్వంలు—తాత్కాలిక మిత్రశత్రుత్వంలు – అధిమిత్ర అధిశత్రుత్వంలు సమత్వం—మొదలైన అనేక విషయాలు తెలుపబడినవి. అటువంటి గ్రహంలు కేంద్రంలందు—ఫణపరంలందు-ఆపోక్లీబంలందున్న స్థితినిబట్టి శుభాశుభంలు తెలుపుదురు.

కాని ఈ పరాశర పద్ధతిలో కేవలం భావాధిపత్యంనకు ప్రాధాన్యమీయబడును. పైన కోణంలు—కేంద్రంలు గురించి కొంత తెలిపెను. అలాగే త్రికంలు గురించికూడ తెలిపెను. వాటిని గురించి వాటి అధిపతులను గురించి ఇచట వివరించబడును:

* కర్మబంధ్వాధిపత్యేన నదిశన్తి శుభం శుభా:
పాపానైవా ఽశుభంకుర్యు: శుభదాశ్చ త్రికోణపా:
త్రిమదాయాఽధిపా: సర్వేగ్రహా: పాపఫలాస్మృతా:
వ్యయ ద్వితీయ రంధ్రా ఽరిపతయ: పరతన్త్రేణ
స్థానాంతరాణుగుణ్యేన భవన్తి ఫలదాయకా:

---

* సర్వేత్రికోణ నేతారో గ్రహా: శుభఫలప్రదా:
పతయ: త్రిమదాయానాంయది పాపఫలప్రదా:
కేంద్రాధిపా: నదిశన్తి శుభం శుభా: పాపం పాపా:
వ్యయ ద్వితీయరంధ్రా ఽరిపతయ: పారతన్త్ర్యేణ
స్థానాంతరాధిపత్యేన భవన్తి ఫలదాయకా:

అన్ని గ్రహంలు త్రికోణంనకాధిపత్యమున్న శుభ ఫలములిచ్చెదరు. తృతీయ–సప్తమ – లాభస్థానంలకాధిపత్యంగల గ్రహంలన్నియు పాపఫల మిచ్చును. (నైసర్గిక) శుభులు కేంద్రాధిపతులైన శుభఫలమీయారు (నైసర్గిక) పాపులు కేంద్రాధిపతులైన పాపఫలమీయరు. పన్నెండు–రెండు–ఎనిమిది–ఆరు భావంలకు అధిపత్యమున్న గ్రహంలు అస్వతంత్రులగుటవలన వాటికి గల రెండో ఆధిపత్యం ప్రకారం ఫలమునిచ్చువారగుదురు.

నైసర్గిక శుభపాపంతో నిమిత్తంలేకుండ తొమ్మిది గ్రహంలు కోణాలైన లగ్న-పంచమ-నవమ భావాలకు అధిపత్యమున్న శుభఫలాలనే ఇచ్చెదరు. అలాగే అందరూ తృతీయ-సప్తమ-లాభ భావాల అధిపతులయినచో పాప ఫలములనిత్తురు.శుభులైన గురుశుక్రులు కేంద్రంలయిన లక్ష్మీస్థానములు(చతుర్థ దశమ) కధిపతులైన శుభఫలముల నీయరు-అటులనే పాపులయిన రవి-కుజ-శనులు కేంద్రాల (లక్ష్మీస్థానాల) కు అధిపతులయిన పాపఫలమీయరు. ఇక చంద్రుడు శుభుడయినచో గురు శుక్రులవలెను,పాపియైన చోరవికుజ శనుల వలెను ఫలితాలుండును. బుధుడు శుభుడు కాడు–పాపియు కాడు అని ముందు తెలిపెను.

ఇక వ్యయ ద్వితీయ అష్టమ షష్ఠ భావాలకు అధిపతులయినపుడు (తారాగ్రహాలయిన కుజ బుధ గురు శుక్ర శని) వారికుండు రెండో అధిపత్యమును బట్టి ఫలములిచ్చెదరు. అనగా కోణాధిపత్యమున్న శుభ ఫలమున్నూ–తృతీయ సప్తమ లాభాధిపత్యంలున్న పాపఫలమున్నూ ఇచ్చెదరు.

ఏకరాశ్యధిపతులయిన మండల గ్రహాలు రవి చంద్రుడు ఈ అస్వతంత్రభావాలయిన వ్యయ అష్ట ద్వితీయ షష్ఠభావాలకు అధిపతులయినచో శుభ ఫలాల నీయజాలరు.

రాశిద్వయ పతీనాంచేత్శు భత్వమపిపాపతా
విచారేతారతమ్యస్య బలీయాన్విషమ: సమాత్

గ్రహమునకు శుభాధిపత్యము పాపాధిపత్యము రెండూ సంభవించినపుడు విచారణ చేయగా బేసిభావాధిపత్యము సరిభావాధిపత్యం కన్న ఎక్కువ బలమైనది.

ఇది తౌరాగ్రహాలయిన కుజ బుధ గురు శుక్ర శనులకు వర్తించును. అలా రెండు అధిపత్యాలున్నపుడు ఒకటి బేసి భావాధిపత్యం–రెండవది సరి భావాధిపత్యం వుండును ఏ గ్రహంనకు రెండు బేసి భావాల అధిపత్యం గాని రెండు సరిభావాధిపత్యాలు గాని ఒకేమారు కలుగవు. అందువలన బేసిభావ అధిపత్యం శుభమైనదయిన (లగ్న పంచమ నవమ) శుభం పాపమయినదయిన (తృతీయ సప్తమ లాభాలు) పాపం.

యది రాశిద్వయ పతే: శుభత్వమపిపాపతా
సూర్యపుత్రస్య పాపత్వం శుభత్వాదతిరిచ్యతే

శుభభావాధిపత్యం పాపభావాధిపత్యం శనికి సంభవించినపుడు శనీ యొక్క పాపత్వం శుభత్వంకన్న ఎక్కువ అగుచున్నది.

శుభోపినాధికం యోగీచంద్రో భాస్వతి పాపిని
శుభేపాపోఽపిపాపో నరవిశ్చైవం నిశాకరే

చంద్రుడు శుభుడయినను, రవి పాపియైనపుడు ఆ చంద్రుడు మంచి యోగము నీయజాలడు. అటులే రవి పాపియైనను చంద్రుడు శుభుడయినందున ఆ రవి పాపఫల మీయడు. ఇచట చంద్రుడు శుభుడు రవి పాపి అయినపుడు చంద్రుడు శుభఫల మీయడు రవి పాపఫలమీయడు.

ఇది మీన మిధున తులా లగ్నములకు చంద్రుడు వరుసగా 5-2-10 అధిపత్యాల వలన శుభుడు రవి 6–3–11 అధిపత్యాల వలన పాపి అగుచున్నాడు.

ధీధర్మాజ్ఞా శుభేశానాం బహూనామథవాద్వయో
రంధ్రాంత్యారి పతీనాంచ సంబంధో యోగకారకా:

పంచమ, నవమ, దశమ చతుర్థ భావాధిపతులలో అందరూ లేదా ఏ ఇరువురయిననూ యుతి లేదా ఒకడింకొకని దృష్టి పొందినచో యోగమునివ్వ వారగుదురు. అటులనే అష్టమ వ్యయ షష్ఠాధిపతులందరు లేదా ఏ ఇరువురు సంబంధం కలిగిననూ యోగమునిచ్చెదరు.

కోణయో: సుఖరాజ్యేశౌ కోణేశౌసుఖరాజ్యయో:
స్వర్షం వినాత్రికేశేనా: త్రికేవాయోగకారకా:

కోణములందు చతుర్థ లేదా దశమాధిపతి ఉన్ననూ-చతుర్థ లేదా రాజ్యమందు కోణాధిపతు లున్ననూ రాజయోగ కారకులు అగుదురు. అట్లే స్వక్షేత్రం విడిచి త్రికములందు త్రికాధిపతులున్ననూ రాజయోగము నిచ్చెదరు.

శుభా నామపిపాపానాం సంబంధశ్చేత్పరస్పరం
పాపాయోగప్రదా స్తత్ర నాతియోగ కరాశ్శుభా:

శుభులకు (కోణాధిపతుల) పాపులకు (3–7–11 భావాధిపతులు) సంబంధం అనగా కలిసినను లేదా ఒకరినొకరు పూర్ణదృష్టితో చూచినను, అందు పాపులు మంచి శుభపలితము లిచ్చెదరు. కాని శుభులు అంతగా యోగించరు.

ఇచట తెలిపినదానిలో శుభులు అనగా కోణాధిపతులనియు- పాపులు అనగా తృతీయ-సప్తమ-లాభాధిపతులు అని గ్రహించవలెను. కాని నైసర్గిక శుభ పాపులని మాత్రం కాదు.

నైసర్గిక శుభస్వామి సంబంధో భావపుష్టికృత్
నిసర్గపాప సంబంధా: కల్పతే భావహానయే

ఏ భావమునకైనను నైసర్గిక శుభగ్రహ సంబంధము ఆ భావమునకు బలమునిచ్చును. నైసర్గిక పాపగ్రహ సంబంధం బలహీనపరచును.

ఈ విధంగ ద్విరాశ్యధిపతులు అయిన తారాగ్రహాలను గురించి-మండల గ్రహాలయిన రవి-చంద్రులను గురించి తెలిపి తర్వాత ఛాయా గ్రహాలయిన రాహు కేతువుల గురించి తెలుపుచున్నాడు.

యద్యద్భావగతౌవాపియద్య ద్భావేశసంయుతౌ
త త్తత్ఫలాని ప్రబలౌ ప్రదిశేతాంతమోగ్రహౌ

తమోగ్రహములు (రాహుకేతువులు) ఏ భావాధిపతితో కలిసియుందురో

ఆ భావాధిపతి ఫలములున్న, అట్లు ఏ భావాధిపతితోనూ యుతి పొందనిచో తామున్న భావాధిపతి యొక్క ఫలములు బలంగ ఇచ్చువారగుదురు.

అనన్తరము సూర్యునితో చేరినందున సూర్యునికి సప్తమ మందున్న తారాగ్రహములిచ్చు ఫలితాలు గురించి తెలుపుతున్నాడు.

ఖేటా: పూర్ణఫలం దద్యు: సూర్యాత్సప్తమకేస్థితా:
ఫలాభావంవిజానీయా త్సమే సూర్యనభశ్చరే
మధ్యే అనుపాతాత్సర్వత్ర హ్యుదయాస్త వింశోపకా:

సూర్యునకు సప్తమమందున్న గ్రహం సంపూర్ణ ఫలములనిచ్చును. (శుభముగాని అశుభముగాని) సూర్యునితో యుతి పొందినచో నిష్ఫలమని తెలుసుకొనుము. ఈ రెండు భావాలకు మధ్యలో గ్రహమున్నచో త్రైరాశిక పద్ధతిని దాని బలం తెలుసుకొనుము.

వక్రగామీ సదా రాహు: శీఘ్రగౌ చంద్రభాస్కరౌ *
క్రూరవక్రా మహాక్రూరాసౌమ్యవక్రా: సుశోభనా:

రాహుకేతువులు ఎల్లపుడు వక్రమార్గమున సంచరించెదరు. రవి చంద్రులు ఋజుమార్గముగ శీఘ్రగాములు. క్రూరులు (పాపులు) వక్రించిన అధికపాప పలాలుండును. శుభులు వక్రించిన శుభఫలములు అధికముగ ఉండును.

ఇచట ఈ వక్రమనునది కేవలం తారాగ్రహాలయిన కుజ బుధ గురు శుక్ర శనులకు మాత్రమేనని తెలుసుకొనవలెను. కనుకనే శ్లోకంలో రాహుకేతు సూర్యచంద్రుల గమనములు గురించి తెలిపాడు. అనగా ఈ వక్రగమనము వాటికి అన్వయం కాదు అని భావం.

అయితే ఇచట "వక్రము" అను దానిగూర్చి కొంత తెలుసుకొనవలసి వుంది. తారాగ్రహములకు అష్ట విధాలయిన గమనములున్నవి.

---

* వక్రిణస్తు మహావీర్యా: శుభా: రాజ్యప్రదాగ్రహా:
పాపా: వ్యసనిదా: నృణాంకుర్వన్తి చవృథాటనం

అయితే ఇది యదార్థ గమనం కాదు. భూకేంద్రం నుండి గ్రహాలను చూచునపుడు కలిగించే భ్రమవంటిది. (Geocentric Parallax error). అది:-

వక్రానువక్రా కుటిలా మందా మందతరా సమా
తథాఽస్తంగతస్య శీఘ్రా గ్రహాణామష్టధా గతిః

వక్రం, అనువక్రం, కుటిల, మన్ద, మన్దతరా–సమా, అస్తంగత్వం, శీఘ్రగతి అను ఎనిమిది విధములయిన గతులు గ్రహాలకు చెప్పబడినవి.

సూర్యముక్తా ఉదీయన్తే శీఘ్రగామీ ద్వితీయగే
సమాస్తృతీయగే భానౌ మందా చతుష్టగే తథా
వక్రాస్యుః పంచమే షష్ఠే త్వతివక్రేఽష్టసప్తమే
కుటిలాచ నవమే దశమే మన్దతరాస్తథా
ఏకాదశే సమేచ ద్వాదశస్తు శీఘ్రతాంపునః
వక్రానువక్రా కౌటిల్యే వక్రభావాః ప్రకీర్తితాః

1. సూర్యునితో యుతి పొందిన అస్తమనము.
2. ద్వితీయ మందున్న శీఘ్రగామి.
3. తృతీయ మందున్న సమము.
4. చతుర్థ మందున్న మందగమనము.
5. 6. పంచమ మందు షష్ఠమందు వక్రము.
7. 8. సప్తమ అష్టమ మందు అతివక్రము.
9. నవమ మందు కుటిల గతి (మరల ఋజు గతి).
10. దశమ మందు మందతర (మిక్కిలి మన్దగతి).
11. సూర్యునికి లాభమందు సమగతి.
12. ద్వాదశ మందు శీఘ్రగతి.

వక్ర అతివక్ర కుటిల అనునవి, గ్రహము సూర్యుని నుండి 5-6-7-8-9 రాసులలో నున్నపుడు సంభవించును.

మండల గ్రహమైన సూర్యుడొక్కడే స్వయంప్రకాశము గల గ్రహము. మిగిలినవి ఆ సూర్యుని ప్రకాశమును పొంది భూమికి ప్రతిబింబింప చేయును. అలా ప్రతిబింబించుటలో సూర్యునికి సప్తమ మందున్న (180° దూరమున) సంపూర్ణ ఫలితములుండు. సూర్యునితో యుతి పొందుట వలన అస్తమనము

(0°) అనగా కాంతిహీనమగును. అలాగున (0°—180) మధ్యనున్నపుడు పైతెలిపిన గతులు ఏర్పడును. అందుకే 'వక్రీబలీ' అనునది వాడుకలోవున్నది.

అయితే కుజ-గురు-శని ఈ మూడున్ను భూమి కక్ష్యకి వెలుపల ఉన్నందున ఇవి సూర్యునికి సప్తమమందుండుట సంభవము. మరి భూమికి—సూర్యునికి మధ్యలో వున్న బుధ శుక్రులు సంగతేమిటి? ఇవి సూర్యునికి సప్తమరాశిలో ఎన్నడూ వుండవు కదా! మరి వీటిగురించి ఎట్లు తెలుసుకొనుట బుధుడు ఎప్పుడు 27° శుక్రుడు 47° లు సూర్యుని నుండి వుందురు. వీటి గురించి సాధారణ పంచాంగములందు (Standard Ephemeris) లో తెలుపబడును. రెండు విధములయిన అస్తంగతములున్నవి ఈ రెండు గ్రహాలకు.

1. భూమికి సూర్యునికి మధ్య ఈ గ్రహాలున్నపుడు అవి సూర్యుని నుండి సప్తమములో ఉన్నట్లు గ్రహించవలెను. (Inferior Conjunction)

2 భూమికి ఈ గ్రహాలకు మధ్య సూర్యుడున్నచో అది అస్తంగత దోషము అని తెలుసుకొనవలెను. (Superior conjunction)

ఈ రెండు స్థానముల మధ్యలో ఉన్నచో త్రైరాశిక పద్ధతిని తెలుసు కొనగలరు.

ఏవంభావాధిపత్యేన జన్మలగ్నవశాదిహ
శుభత్వ మశుభత్వంచ గ్రహాణాం ప్రతిపాదితం
అనుక్తమన్యతో గ్రాహ్యం అవిరుద్ధం యదశ్యచ
ఏషాపరాశర ప్రోక్తేశాస్త్రే సంజ్ఞావిశిష్యతే

ఈ విధంగ లగ్నాది భావాధిపత్యమువలన గ్రహాల శుభాఽశుభాలు తెలుపబడెను. ఇచట తెలుపని విషయాలు ఇతర శాస్త్రముల నుండి గ్రహించవచ్చు కాని ఇచట తెలిపినదానికి విరుద్ధంగ వుండరాదు. ఇది పరాశరునిచే చెప్పబడిన శాస్త్రమందలి సంజ్ఞల యొక్క విశేత.

# రాజయోగాధ్యాయము

అధాపరం ప్రవక్ష్యామి రాజయోగమనేకథా
విష్ణు స్థానం త్రికోణాఖ్యం లక్ష్మీ స్థానం తు కేంద్రకౌ
తయోరీశాస్సం బంధేన చక్రవర్తీ నరోభవేత్

అనంతరం రాజయోగమనేక విధములయినది తెలిపెదను. త్రికోణములు విష్ణు స్థానములు. కేంద్రములు లక్ష్మీ స్థానము వాటి సంబంధమువలన మానవులు చక్రవర్తులు కాగలరు.

ఇచట ఈ అధ్యాయంలో కేంద్రమనగా లక్ష్మీస్థానం (4-10 భావాలు) కోణమనగా (5-9 భావాలు) విష్ణు స్థానం అని గ్రహించవలెను.

కేంద్రత్రికోణ పతయః సంబంధేన పరస్పరమ్
ఇతరైర ప్రసక్తాశ్చేద్విశేష శుభదాయకాః

కేంద్ర త్రికోణాధిపతులు పరస్పర సంబంధమువలన వారికి ఇతర సంబంధము లేకున్నచో విశేషమైన శుభమునిచ్చువారగుచున్నారు.

కేంద్రాధిపతులు అనగ చతుర్ధ దశమాధిపతులు- కోణాధిపతులు అనగా పంచమ నవమాధిపతులు. ఈ నలుగురు ఒకరికొకరు సంబంధం వున్నచో (సంబంధం అనగా యుతి లేదా ఒకరినింకొకరు పూర్ణదృష్టిని చూచుట. లేదా ఒకని ఇంట ఇంకొకడుండుట.) చాలా ఎక్కువ శుభయోగము నిచ్చువారగుదురు.

ఇతర సంబంధం అనునది కోణాలు (5-9) కేంద్రాలు (4-10) కాని ఆధిపత్యాలు. అవి ద్వితీయ, తృతీయ, షష్ట, సప్తమ, అష్టమ, లాభ, ద్వాదశములు. వీటియందు స్థితి లేదా వీటి అధిపతుల యుతి, వీక్షణ లేనటువంటివి అని తెలుసుకోవలెను.

అయితే అలా తెలిపిన ఇతరాధిపత్యాలు ఈ కేంద్ర కోణాధిపతుల కున్నచో?! ఇచట వివరం చెబుతున్నాడు :—

కేంద్ర త్రికోణనేతారో దోషయుక్తావపి స్వయం
సంబంధమాత్రా ద్బలినౌ భవేతాం యోగకారకౌ

కేంద్ర కోణాధిపతులు (లక్ష్మీ విష్ణు స్థానాధిపతులు) స్వయముగ దోషంతో కూడినవారయిన (అనగా వారికున్న రెండో ఆధిపత్యం వలన దోషులయినచో) నూ పరస్పర సంబంధాలవలన బలీయులయి యోగమునిచ్చు వారగుచున్నారు.

కోణాదిపతులకు కలిగే దోషము షష్ఠ అష్టమ వ్యయాదిపత్యములు అటువంటి ఆదిపత్యం వలన దోషంలేదు. అలాగే కేంద్రాదిపతులకు తృతీయ సప్తమ లాబాదిపత్యాలున్ననూ దోషంలేదు.

నివసేతాం వ్యత్యయేన తావుభౌ ధర్మకర్మణోః (కేంద్రకోణపౌ)
ఏకత్రాఽన్యతరోవాఽపి వసేచ్చేద్యోగకారకౌ

ఆ ఇరువురు భాగ్యరాజ్యాదిపతులు భాగ్యాదిపతి రాజ్యమందును. రాజ్యాదిపతి భాగ్యమందును ఉన్ననూ లేదా ఇరువురులో ఒకడు ఆ భాగ్య రాజ్యములందుండి మరొకడు వారికున్న ఇతర భావమందున్ననూ లేదా ఆ యిరువురు వారికున్న నాలుగు భావములలో ఒకేచోట వున్న యోగంనిచ్చువా రగుదురు.

ఇచట కేవలం భాగ్యరాజ్యాదిపతుల గూర్చి మాత్రమే తెలిపెను. కాని చతుర్ధ భాగ్యాధిపతి లేదా పంచమ రాజ్యాధిపతికి లేదా చతుర్ధ పంచమాదిపతికి మధ్య ఇటువంటి సంబంధం మంచి యోగం నిచ్చును. అ వివరము తర్వాత తెలుపుతున్నాడు :-

త్రికోణాధిపయోర్మధ్యే సంబంధో యేనకేనచిత్
కేంద్రాధిపస్య బలినోభవేద్యది సయోగకృత్

త్రికోణాదిపతులలో ఏ ఒక్కనికయిననూ కేంద్రాదిపతి యొక్క సంబంధ మున్నచో బలీయమై అది మంచి యోగమునిచ్చును.

త్రికోణాదిపతులు లగ్నాదిపతి, పంచమాదిపతి, భాగ్యాదిపతి. వీరు శుభులు అని ఆదినుంచీ చెపుతున్నదే. అట్టి కోణాదిపతులు ముగ్గురులో ఏ ఒకనితోనయిననూ కేంద్రాదిపతి (లక్ష్మీ స్థానాదిపతి) అనగా చతుర్ధాధిపతి

లేదా దశమాదిపతి యొక్క సంబంధం (అనగా కోణాదిపతి కేంద్రాదిపతి కలసి వుండుట—లేదా కేంద్రాదిపతి ఇంటిలో కోణాదిపతి, వాని యింటిలో కేంద్రాధిపతి వుండుటలేదా ఒకరి నింకొకరు చూచుట) ఉన్నచో ఇరువురు మంచి యోగం నిచ్చెదరు.

దశాస్వపి భవేద్యోగః ప్రాయశో యోగకారిణోః
దశాద్వయీ మధ్యగత తదయుక్శుభ కారిణామ్

తరచుగ రెండు యోగకారక గ్రహాల దశల మధ్యవచ్చు శుభగ్రహ దశ, ఆ రెండు యోగకారకులలో ఏ ఒక్కనితోను యుతి పొందకున్ననూ, మంచి యోగమునిచ్చును.

పై శ్లోకములో త్రికోణాధిపతులతో కేంద్రాధిపతులకు గల సంబంధం వలన శుభయోగమున్నదని తెలిపాడు. ఇచట అటువంటి రెండు యోగకారక గ్రహాల దశల మధ్య వచ్చే శుభగ్రహ దశ (కోణాధిపతి దశ) ఆ రెండు యోగకారకులలో ఏ ఒకనితోనూ యుతి పొందకపోయినప్పటికి యోగించును.

ఉదాహరణమునకు ఒక జాతకములో రవి కుజు లిరువురి దశలు యోగకారక దశలు. అట్టి రవి కుజులతో యుతి పొందని చంద్రదశ కూడ మంచి యోగమునే యిచ్చును.

యోగకారక సంబంధా త్పాపినో పి గ్రహాః స్వతః
త త్త ద్భు క్త్యనుసారేణ దిశేయుర్యోగజం ఫలమ్,

గ్రహాలు స్వతహాగా పాపులయినప్పటికి యోగకారక గ్రహాల సంబంధమువలన వాటి వాటి భుక్తుల ననుసరించి యోగఫలమునిచ్చును.

గ్రహాలకు తృతీయ (3) సప్తమ (7) లాభా(11) ధిపత్యాలు వలన పాపులగుచున్నారు. అట్టి పాపగ్రహాలు పై తెలిపిన యోగకారకులతో యుతి పొందినను లేదా వాటిచే చూడబడిననూ ఈ పాపగ్రహాలు శుభయోగములను ఆయా యోగకారక భుక్తుల ననుసరించి యిచ్చెదరు.

కేంద్ర త్రికోణాధిపయో రేకత్వే యోగకారితా
అన్య త్రికోణపతినా సంబంధోయది కింపునః

కేంద్రాధిపత్యము కోణాధిపత్యము ఒకే గ్రహమునకున్న యోగము నిచ్చును. అట్టి గ్రహమునకు మరొక కోణాధిపతి సంబంధమున్న ఆ యోగం మరికొంత వృద్ధిచెందును.

ఇచట ముఖ్యంగా గమనించదగిన విషయం కేంద్ర కోణాధిపత్యం గల గ్రహమునకు (లక్ష్మీ విష్ణు స్థానాధిపత్యం) ఇంకొక కోణాధిపతి (విష్ణు) సంబంధం మంచి యోగమిచ్చును అని తెలుపబడింది. కాని ఇంకొక కేంద్రాది పత్యం (లక్ష్మీ స్థానం) గురించి చెప్పలేదు. ఏలన ఏ లగ్నమునకయినను చతుర్థ కేంద్రాధిపతికి దశమకేంద్రాధిపతి శత్రువగును. అందువలన ఆ యోగం భంగమగును కనుక మరొక కేంద్రాధిపతి (లక్ష్మీస్థానాధి) సంబంధం అనునది తెలుపలేదు.

ధర్మకర్మాధినేతారౌ రంధ్ర లాభాధిపౌ యది
తయో స్సంబంధమాత్రేణ నయోగం లభతేనరః

భాగ్యాధిపతికి అష్టమాధిపత్య ముండినను–రాజ్యాధిపతికి లాభాధిపత్య మున్ననూ అట్టి భాగ్యరాజ్య భావాధిపతుల సంబంధంవలన మంచి యోగము లభించదు.

భాగ్యాధిపతికి అష్టమాధిపతి సంబంధం వలన రాజ్యాధిపతికి లాభాధి పతి సంబంధం వలన యోగముండదు. అటులనే పంచమాధిపతికి షష్ఠాధిపతి సంబంధమున్ను చతుర్థాధిపతికి తృతీయాధిపతి సంబంధమున్ను యోగభంగం చేయును–లగ్నాధిపతికి ద్వితీయ వ్యయాధిపతుల సంబంధం వలన యోగ భంగమగును.

ఇంతవరకూ తెలిపినదానిని బట్టి మొత్తంపై కేంద్రకోణ సంబంధం యోగం నిచ్చును అని. అయితే కోణాధిపతికి షష్ఠాష్ట వ్యయాధిపత్యాలలో అనగా త్రికాధిపత్యం కూడ వున్న దోషంలేదు. అయినప్పటికి లగ్నకోణాధి పతికి వ్యయాధిపత్యం గాని ద్వితీయాధిపత్యం గాని వున్న యోగించడు– షష్ఠాదిపత్యమున్నను–అష్టమాదిపత్యమున్నను దోషంకాదు.

పంచమ కోణాధిపతికి షష్ఠాధిపతి సంబంధం కూడదు- ద్వితీయ అష్టమ వ్యయాధిపతుల సంబంధం వలన దోషంలేదు.

భాగ్యాధిపతికి (నవమ కోణం) అష్టమాధిపతి సంబంధం దోషము నిచ్చును. కాని షష్ఠాదిపత్యం-వ్యయ ద్వితీయాదిపత్యములున్న దోషం కాదు.

కేంద్రాధిపతికి కోణాదిపత్యము (శుభాది) గాని లేదా తృతీయ సప్తమ లాభాదిపత్యముల (పాపాధిపత్యం) లో ఒకటిగాని వచ్చును. అనగా చతుర కేంద్రాదిపతికి కోణాధిపత్యమున్న దశమ కేంద్రాదిపతికి పాపాదిపత్యము లయిన తృతీయ సప్తమ లాభాదిపత్యములలో ఒకటి వుండును. కనుక కేంద్రాదిపతులిరువురు పరస్పర శత్రువులగుదురు. కనుకనే పైన తెలిపిన యోగాలలో ఒక కోణాదిపతికి ఇంకొక కోణాదిపతి సంబంధం వలన యోగం వృద్ధిపొందునని తెలిపెను. కాని ఒక కేంద్రాదిపతికి ఇంకొక కేంద్రాదిపతి సంబంధం వలన యోగం వృద్ధిపొందునని తెలుపలేదు.

కేంద్ర కోణాదిపత్యం గల గ్రహముతో త్రికాదిపత్యం గల తృతీయ సప్తమ లాభాదిపతులు సంబంధం వలన కేంద్ర కోణాదిపత్యమున్న గ్రహం పాపఫలమిచ్చి రెండవ గ్రహం (పాపి) శుభఫలమునిచ్చును.

యది కేంద్రే త్రికోణేవా నివసేతాం తమోగ్రహా
నాథేనాఽన్యతర స్యైవ సంబంధా ద్యోగకారకా

రాహుకేతువులు కేంద్రములందు (లక్ష్మీస్థానము) గాని కోణము (విష్ణు స్థానము) లందుగాని వుండి ఆ కేంద్రకోణాదిపతులకు ఒకరితో ఇంకొకరికి సంబంధమున్నచో ఆ రాహుకేతు లిరువురూ యోగము నిచ్చెదరు.

రాహుకేతువు లిరువురు ఒకే జాతకములో రెండు కోణములందుండుట అసంభవం. ఒకడు కోణమందున్న రెండవవాడు తృతీయ సప్తమ లాభము లలో ఒకదాని యందుండును. అందువలన ఇరువురూ యోగమునిచ్చువార గుట అసంభవం.

కాని ఇరువురు కేంద్రములందుండవచ్చు. చతుర్థ కేంద్రమందు ఒక డున్న రెండవవాడు దశమ కేంద్రమందుండును. అయితే ఇందు కోణాధి పతితో ఏ కేంద్రాదిపతికి సంబంధముండునో ఆ కేంద్రమందున్న ఛాయా గ్రహం యోగము నిచ్చును.

—:o:—

# దశాంతర దశాధ్యాయము

నదిశేయుర్గ్రహాస్సర్వే స్వదశాసు స్వభుక్తిషు
శుభాஉశుభఫలం నృణామాత్మభావానుసారతః

అన్ని గ్రహాలు తమతమ దశలయందు గాని, తమతమ స్వభుక్తులందు గాని శుభఫలములనయినను. అశుభఫలముల సయినను తమ తమ భావము లకు సంబందించినవి మానవులకు ఇవ్వవు.

అనగా గ్రహాలకు శుభాదిపత్యమున్నను పాపాదిపత్యమున్ననూ ఆ ఆదిపత్యమున్న భావంకు సంబందించిన ఫలాలు ఆ గ్రహం తన దశలోగాని తన స్వభుక్తిలో గాని ఈయదు అని అర్ధం. అయితే ఏ గ్రహమైనను తానివ్వ వలసిన ఫలమునెప్పుడిచ్చును?! దానినే ఇచట విపులంగ తెలుపుచున్నాడు.

ఆత్మ సంబంధినోయేచ యేవా నిజసధర్మిణః
తేషా మంతర్దశాస్వేవ దిశన్తి స్వదశా ఫలమ్.

(ఏ గ్రహమైనను) తన దశకు సంబందించిన ఫలాలను తనతో సంబంధమున్న గ్రహం యొక్క దశయందు గాని-తనతో సమాన ధర్మ మున్న గ్రహం దశలో గాని-అలాగే వాటి అంతర్ధశలో గాని ఇచ్చుచుండును.

అనగా ఏ భావంనకు సంబంధమున్ననూ ఆ గ్రహం తనతో సంబంధ మున్న గ్రహం యొక్క దశ లేదా అంతర్దశలో తానివ్వవలసిన ఫలాలిచ్చును.

ఉదాహరణకు భాగ్య కోణాదిపతి దశ జరుగుచున్నది అనుకొందం. ఆ భాగ్య భావంకు సంబంధించిన ఫలం ఆ భాగ్యాదిపతి దశలో ఉండదు. ఆ భాగ్యాదిపతి భాగ్యఫలంను తనతో యుతి పొందిన గ్రహదశలో గాని తన దృష్టి పొందిన గ్రహదశలో గాని ఆ ఫలముల నిచ్చును. ఒకవేళ అలా ఏ గ్రహ సంబంధంలేని యెడల తనతో సమానధర్మంగల గ్రహం దశ (నిజ సధర్మిణః) లో ఆ ఫలాలిచ్చును. అనగా తనతో సమాన ధర్మం గల గ్రహాలు లగ్నాదిపతి, పంచమాదిపతి కనుక అ గ్రహాల దశలలోనూ భుక్తులలోనూ ఆ భాగ్యభావ ఫలాలుండును.

ఇతరేషాం దశానాథ విరుద్ధ ఫలదాయినామ్
తత్త ద్భావాను గుణ్యేన ఫలాన్యూహ్యాని సూరిభిః

దశానాధునికి విరుద్ధంగ ఫలాలిచ్చు ఇతర గ్రహాల విషయంలో ఆయా భావాలకు అనుగుణంగ ఫలాలను పండితులు ఊహించుకొనవలెను.

పైన ఏ గ్రహదశలోనయిననూ ఆ గ్రహం తానిచ్చు ఫలాలను ఎప్పుడిచ్చుననునది తెలిపాడు. అవి తనతో సంబంధమున్న గ్రహాల దశలలోను భుక్తులలోను ఇచ్చును. అని అన్నాడు. తనకు విరుద్ధంగ ఫలాలిచ్చు గ్రహాల గురించి ఇచట తెలుపుతున్నాడు. అనగా ఈ శాస్త్రంలో రెండు వర్గాలు ప్రధానమైనవి తెలిపాడు. ఆదిపత్యం వలన శుభులు (కోణాదిపతులు) రెండోది పాపులు తృతీయ సప్తమ లాభాదిపతులు. ఇవి రెండు పరస్పర విరుద్ధ భావములు. అందు ఒక గ్రహదశ జరుగునపుడు దాని విరుద్ధ భావమందలి గ్రహం యొక్క దశగాని భుక్తిగాని ఎట్లుండును అనునది ఇక్కడ ప్రశ్న.

ఆ విరుద్ధముగ ఫలంలిచ్చు గ్రహం దశానాధునితో యుతి పొందినను లేదా వీక్షణ పొందినను ఆ దశానాధుని ఫలములు తన భుక్తిలో నిచ్చును. అట్లు యుతి వీక్షణ పొందని పరిస్థితులలో ఆ విరుద్ధ గ్రహ భుక్తిలో ఫలములను పండితులు ఊహించుకొనుడని అన్నాడు.

ఉదాహరణకు పైన తెలిపినట్లు భాగ్యాదిపతి దశ జరుగుచున్నది- అందు తనతో ఎట్టి సంబంధంలేని తృతీయ సప్తమ లాబాదిపతులలో ఒకని భుక్తినిచ్చునపుడు ఆ భుక్తిలో పాపపలం అవుతుంది. కాని తనకు ముందు వెనుకల వచ్చే గ్రహాల భుక్తులు శుభమైనచో ఇది కూడ శుభమే ఇచ్చును.
(చూపు 50 శ్లో॥ "దశాస్వపి భవేద్యోగః........")

కనుక ముందు అధ్యాయములందు తెలిపిన విషయాలు అన్నియు జాగ్రత్తగ జ్ఞప్తియందుంచుకుని ఈ ఫలాలను శుభ పాపాధిపత్యముల వలన ఊహించవలెను.

స్వదశాయాం త్రికోణేశో భుక్తౌ కేంద్రపతేః శుభం
దిశేత్సోఽపి తథా నోచే దసంబంధే నఽపాపకృత్

కోణాధిపతి దశలో కేంద్రాధిపతి భుక్తి శుభంను ఇచ్చును. అట్లే కేంద్రాదిపతి దశలో కోణాధిపతి భుక్తి శుభపలము నిచ్చును. ఒకవేళ ఆ యిరువురకు సంబంధం లేనిచో పాపపలముండదు.

పై తెలిపిన శ్లోకముననకు దీనికి గల వ్యత్యాసం గమనింపదగినది– దశానాధునితో సంబంధం లేనటువంటిన్ని దశానాధునికి విరుద్ధంగ పలము లిచ్చు గ్రహదశ భుక్తిలో పాపఫల మిచ్చునుకదా!

కేంద్ర కోణాధిపతులు దశాంతర దశానాధులయినపుడు ఒకని దశలో రెండవవాని భుక్తి వచ్చినచో ఆ భుక్తిలో పాపఫలముండదు.

ఉదాహరణకు కర్కాటక లగ్నమునకు కోణాధిపతియైన కుజదశలో తనకు విరుద్ధమైన తనతో సంబంధంలేని చతుర్థ కేంద్రాధిపతి భుక్తిలో పాప పలముండదు. అలాగే ఆ శుక్రదశలో కుజభుక్తిన్ను.

ఇంతవరకూ గ్రహాలకు ఆధిపత్యం మూలంగ శుభ పాప వర్గవిభజన– వాటి సంబంధం వలన ఇచ్చు ఫలాలు–దశ–అంతర్దశలలో ఇచ్చే ఫలాలు ఎటువంటివి అను వివరాలు తెల్పాడు. ఒక్కొక్క దశ కొన్ని సంవత్సరము లుండును. అలాగే అంతర్ధశలు–అంతరాంతర దశ–సూక్ష్మ దశ ప్రాణ దశ ఎలా లెక్కకట్టడమనేది ముందు తెలియబరిచాడు. అలా ఏర్పరిచిన దశాంతర దశాది వివరం తెలునుకుని అనంతరం వాటికి సంబంధించిన గ్రహాల యొక్క చార తెలుసుకొనవలెను.

ప్రతి నిత్యం గ్రహాలన్నియు చలించుచున్నవి. అలా చలించునపుడు ఆ గ్రహాలు శుభస్థానములందున్న శుభ ఫలాలు అశుభ స్థానములందున్న అశుభ పలాలు ఇచ్చును. అనగా అయిదు రకాల దశలు తెల్పాడు కదా 1. దశ, 2. విదశ, 3. అంతర్దశ, 4. సూక్ష్మదశ, 5. ప్రాణదశ. ఈ అయిదు గ్రహాల మధ్యగల సంబంధం తెలుసుకొనవలెను. అవి గోచార వశ మున (గ్రహచార) చంద్రుని నుండి శుభస్థానములందున్న శుభపలం–పాప స్థానమందున్న పాఫపలము లుండును. అటువంటి గోచార వశమున జన్మ రాశినుండి ద్వాదశ స్థానములలో గ్రహాలిచ్చు పలాలు తెలుసుకొనవలెను.

ఆరంభో రాజయోగస్య భవే న్మారక భుక్తిషు
ప్రథయన్తి తమారద్ధం క్రమశః పాప భుక్తయః

తత్సంబన్ధి శుభానాంతు తథా పునరసంయుజా
మశుభానాం సమత్వేనా ఽసంయోగో యోగకారిణామ్
శుభానాం స్వవియుక్తస్య దశాయాం యోగకారకాః
స్వభుక్తిషు ప్రయచ్ఛన్తి కుత్ర చిన్మారకం ఫలమ్

దీనంతటికి కలిపి భావం గ్రహించినచో సంపూర్ణంగ పలం తెలియును. దీనికి ప్రతిపదార్థం గమనించినచో వివరంగ బోధపడును.

దశాయాం యోగకారకాః = యోగకారక గ్రహ దశలలో,తత్సంబంధి = ఆ యోగకారక గ్రహముతో సంబంధమున్న,మారక భుక్తిభు = మారక గ్రహ భుక్తిలో, రాజయోగస్య = రాజయోగము యొక్క, అరంభః = ప్రారంభం; భవేత్ = అగుచున్నది. తమారబ్ధం = ఆ లా ప్రారంభం నుండి, క్రమశః = క్రమముగ; పాపభుక్తయః = పాపగ్రహముల భుక్తులలోను; శుభానాంతు = శుభుల భుక్తులలోను; తథా = అటులనే; ప్రథయన్తి = వృద్ధి పొందును–పునః = తిరిగి; అసంయుజామ్ = (యోగకారకునితో) యుతి పొందని;అశుభానాం = అశుభ గ్రహభుక్తుల్లోను;అసంయోగో = యుతి పొందని (దశానాథుడయిన యోగకారకునితో); యోగకారిణాం = యోగకారకక భుక్తుల లోను, స్వవియుక్తస్య = తనతో (అనగా దశానాధునితో) యుతి పొందని; శుభానాం = శుభుల భుక్తులలోను; సమత్వేన = సమానముగ (వృద్ధి క్షయములు లేకుండ ఉండును). స్వభుక్తిషు = స్వభుక్తిలో (యోగకారక గ్రహదశలో స్వభుక్తిలో); కుత్రచిత్ = ఒకొక్కపుడు; మారకం పలమ్ = మరణపలము; ప్రయచ్ఛన్తి = ఇచ్చుచున్నవి.

ఇచట వాడిన పదములు ముందుగ గమనార్హం :

1. యోగకారక గ్రహం–(కేంద్ర కోణాధిపత్యము) లక్ష్మీ విష్ణుస్థానాధిపత్యాలు గల గ్రహం.

2. మారక గ్రహం: ద్వితీయ–సప్తమ–వ్యయాధిపతులు.

3. పాపి = ద్వితీయ, చతుర్థ దశమాధిపత్యంలతో గూడిన తృతీయ సప్తమ లాభాదిపతులు.

4. శుభులు: కోణాదిపత్యంతో కూడిన త్రికాదిపతులు.

5. అశుభులు; కేవలం త్రికాదిపతులు.

రాజయోగకారక గ్రహంతో సంబంధమున్న మారక గ్రహ భుక్తిలో రాజయోగము ఆరంభము. అలా ఆరంభమైన యోగము క్రమముగ శుభులు, పాపులు భుక్తులలో వృద్ధిఅగుచున్నది. సంబంధములేని యోగకారక శుభాశుభ గ్రహభుక్తులలో వృద్ధిక్షయములు లేకుండా ఉండును. ఒక్కొక్కప్పుడు స్వభుక్తిలో మరణము కలుగును. మారక గ్రహసంబంధంవలన యోగకారకుడు మారకుడగును. ముందుతెలిపిన ఆయుర్భావ నిర్ణయంచేసినమీదట దీనిని నిర్ణయించవలెను. ఆయుర్భావము బలంగ ఉన్నచో రాజయోగమునిచ్చును. లేనిచో ఆయుర్భంగముండును.

తమోగ్రహౌ శుభారూఢావసంబంధేన కేనచిత్
అంతర్దశానురూపేణ భవేతాం యోగకారకౌ॥

రాహుకేతువులు శుభస్థానములను పొందినవారై, ఏ ఒకనితోనూ సంబంధములేకున్ననూ అంతర్దశరూపములో యోగకారకులగుచున్నారు.

అనగా ఈ రాహుకేతువులు శుభస్థానములు అనగా పై తెలిపిన యోగకారక భావములందున్నవారై —ఆ భావాధిపతులతో సంబంధములేకున్నను పై యోగదశలో ఈ రాహు కేతుభుక్తులు శుభఫలమునిచ్చును.

పాపా యదిదశానాథా శుభానాం తదసంయుజామ్
భుక్తయః పాపఫలదాః, తత్సంయుక్శుభభుక్తయః
భవన్తిమిశ్రఫలదా, భుక్తయోయోగ కారిణామ్
అత్యన్త పాపఫలదా భవన్తితత్సంయుజామ్

పాపా = పాపి; అనగా తృతీయ సప్తమలాభాధిపతులలో నొకడు; యది దశానాథా = దశానాథుడైనపుడు; తదసంయుజామ్ = తనతో యుతి పొందని, శుభానాం = శుభులయొక్క (కోణాధిపతుల); భుక్తయః = భుక్తులలో; పాపఫలదా = పాపఫలమిచ్చును; తత్సంయుక్ = తనతో యుతిపొందిన; శుభభుక్తయః = శుభులభక్తులలో; మిశ్రఫలదా భవన్తి = మిశ్రమ ఫలమిచ్చును; తదసంయుజామ్ = తనతో యుతిపొందని; యోగకారిణాం = యోగకారకు (కేంద్ర కోణాధిపత్యమున్న)ల; భుక్తయోః = భుక్తులలో; అత్యన్త = మిక్కిలి; పాపఫలదా = పాపఫలమిచ్చువారు; భవన్తి = అగుచున్నారు.

తృతీయ సప్తమ లాభాధిపతులలో ఏ గ్రహదశయైనను తనతో కలవని శుభుల భుక్తులలో (అనగా కోణాధిపతి భుక్తి) పాపఫలమిచ్చును. దశనాధునితో యుతిపొందిన శుభభుక్తిలో మిశ్రమ ఫలముండును-దశానాధునితో యుతి పొందని యోగకారక గ్రహ (కేంద్ర కోణాధిపతి) భుక్తిలో మిక్కిలి పాపఫల మిచ్చును.

సత్యపి స్వేచ సంబంధేన హన్తి శుభభుక్తిషు *
హన్తి సత్యప్యసంబంధే మారక: పాపభుక్తిషు

మారక:=మారక గ్రహం; స్వేచ=తనతో; సంబంధేన సత్యపి = సంబంధం కలిగియున్నందున;శుభభుక్తిషు = శుభగ్రహ భుక్తిలో;హన్తి = మారకము నిచ్చుచున్నారు; అసంబంధే సత్యపి = సంబంధం లేకపోయినప్పటికి; పాప భుక్తిషు = పాపగ్రహ భుక్తిలో; హన్తి = చంపును.

మారక గ్రహంయొక్క సంబంధమున్నందున శుభగ్రహం ఆ మారక గ్రహదశలో తన భుక్తిలో మారకంనిచ్చును-మారక గ్రహంతో సంబంధం లేకున్నను పాపగ్రహభుక్తిలో మారకం సంభవించును.

పరస్పర దశాయాం స్వభుక్తౌ సూర్యజ భార్గవౌ
వ్యత్యయేన విశేషేణ ప్రదిశేతాం శుభాఽశుభమ్

శని శుక్రులు పరస్పర దశాభుక్తులలో శుభాశుభ ఫలములు వ్యత్యస్తమైనవి మిక్కుటముగ నిచ్చెదరు.

అనగా ఏ లగ్నమునకయినను శని శుక్రులు శుభులయిన (కోణాధిపతులు) శని దశ శుక్ర భుక్తి లేదా శుక్రదశ శని భుక్తిలో పాపఫలముల నిచ్చెదరు.

ఏ లగ్నమునకయినా పాపులయిన అనగా తృతీయ-సప్తమ-లాభాధిపత్యములు కలిగిన ఆ శనిదశ శుక్ర భుక్తి లేదా శుక్రదశ శని భుక్తిలో అత్యంత శుభపలము నిచ్చెదరు.

షష్ఠేఽష్టమే దశానాథాద్ద్వాదశేవా స్థితో గ్రహః
పాపీచేదతి పాపః స్యాత్ శుభశ్చేన్నాతి సౌఖ్యకృత్

దశానాధునికి షష్ఠ అష్టమ వ్యయభావములందు పాపగ్రహమున్న అత్యంత పాపపల మిచ్చును. శుభగ్రహమున్నచో అతిసౌఖ్యము నీయజాలదు.

---

* మారకస్య దశాకాలే సంబంధి శుభభుక్తిషు
అసంబంధిఖలానాంచ మారకో భవతి ధ్రువమ్

# విశేషాధ్యాయం

ద్రవిణేవా వ్యయాధీశో వ్యయేవా ద్రవిణాధిపః
పరస్పర వా యుక్తౌ తా ద్రవిణ వ్యయకారకౌ

వ్యయాదిపతి ధనభావమందున్ననూ, వ్యయమందు ధనాధిపతి యున్ననూ లేదా పరస్పరం వ్యయాదిపతి ధనభావమందు ధనాదిపతి వ్యయ భావమందున్నను-ఇరువురు యుతి పొందినను ధన వ్యయమునకు కారకు లగుచున్నారు

చన్ద్రా ద్రన్ధ్రారి కామస్థైః సర్వైః స్యాదధియోగకః
తత్రరాజాచ మన్త్రీచ సేనానీశ్చ బలక్రమాత్

చంద్రుని నుండి అష్టమ-షష్ఠ-సప్తమ భావాలలో సమస్త గ్రహము లున్న అధి యోగమనబడును. అందువలన బలక్రమమును బట్టి రాజు, మంత్రి, సేనాని మొదలయిన యోగములుండును.

చన్ద్రా ద్వృద్ధిగతైః సర్వైః గ్రహైః జాతోమహాధనీ
ద్వాభ్యాం మధ్యధనోజాతః ఏకే నాఽల్పధనో భవేత్

చంద్రుని నుండి దశమములో సమస్త గ్రహము లుండగ పుట్టిన వ్యక్తి గొప్ప ధనవంతుడగును. ఇరువురయినను ఉన్నయెడల మధ్య ధనికుడగును. ఒక గ్రహమున్న అల్పధనము గలవాడగును.

చంద్రాత్ స్యాన్త్యోభయ స్థేహి గ్రహే సూర్యం వినా క్రమాత్
సునఫాఖ్యో ఽనఫాఖ్యశ్చ యోగో దురధరాహ్వయః

చంద్రుని నుండి ద్వితీయ స్థానమున, ద్వాదశమున లేదా ద్వితీయ ద్వాదశములందు సూర్యుడు వినా తక్కిన అయిదు గ్రహాలున్న సునఫా, అనఫా, దురధరా అను యోగములగును.

అనగా చంద్రునికి రెండవ ఇంట కుజాది పంచగ్రహాలలో ఏ గ్రహ మున్నను సునఫాయోగము. అట్లే ద్వాదశమందున్న అనఫాయోగము. ద్వితీయ ద్వాదశముల రెండింటియందున్న దురధరా యోగము అగును.

రాజావా రాజతుల్యోవా ధీ ధన ఖ్యాతిమాం జనః
స్వభుజార్జిత విత్తశ్చ సునఫాయోగసంభవః

సునఫా యోగమందు జనించినవారు రాజులు లేదా రాజ సమానులు లేదా బుద్ధిమంతులు-ధనవంతులు ఖ్యాతిగలవారు-సొంత శ్రమవలన ఆర్జించిన ధనం గలవారు అగుదురు.

అనగా చంద్రుని నుండి ద్వితీయమందున్న గ్రహాలను బట్టి ఈ ఫలము లుండును.

భూపో ఽగదశరీరశ్చ శీలవాన్ ఖ్యాతఃకీర్తిమాన్
సురూపశ్చా ఽనఫాజాతో సుఖైః సర్వైః సమన్వితః

అనఫా యోగమున బుట్టిన రాజు- నిరోగి- సత్శీలుడు-ఖ్యాతి- కీర్తి వంతుడు-మంచి రూపముగలవాడు, సర్వసుఖములతో గూడుకున్నవాడు అగును.

ఉత్పన్న సుఖభుగ్ దాతా ధన వాహన సంయుతః
సద్భృత్యో జాయతే నూనం జనో దురధరాభవ:

దురధరా యోగమున బుట్టినవారు-ఉత్పన్న సుఖభోగములు గల వాడు-దాత-ధనవాహనములతో గూడుకొన్నవాడు-ఉత్తమ నౌకరులు గల వాడు-తక్కువ జనము గలవాడు అగును.

చన్ద్రా దాద్య ధనాఽన్త్యస్థో వినా భానుం నచేద్గ్రహ:
కశ్చిత్స్యా ద్వావినా చన్ద్రో లగ్నాత్ కేంద్రగతోఽథవా
యోగ: కేమద్రుమో నామ తత్రజాతో ఽతిగర్హిత:
బుద్ధి విద్యా విహీనశ్చ దరిద్రాపత్తిసంయుత:

చంద్రుడున్న రాశిలోను-చంద్రునికి ద్వితీయ ద్వాదశములలోను సూర్యేతర గ్రహములు లేకున్న అట్లే లగ్నమునుండి కేంద్రమందు సూర్యేతర గ్రహములు లేకున్నను కేమద్రుమమను యోగమగును. అలా జన్మించిన వ్యక్తి అతిగర్హితుడు-బుద్ధి-విద్యావిహీనుడు దరిద్రం ఆపదలతో కూడుకున్నవాడు అగును.

గురౌషష్ఠాష్టరి. షష్ఠే చంద్రే శుక్రయుతో యది
శకట యోగేతి ఖ్యాత: సర్వకల్యాణహావేత్

చన్ద్రునికి ఆరు-ఎనిమిది-పన్నెండు భావములలో గురువున్నను, లేదా గురువు శుక్రునితో యుతి పొందిననూ అట్టి స్థితికి శకటయోగమని పేరు-అది జాతకమందలి ఇతర సర్వ శుభయోగాలను నశింపజేయును.

అన్యయోగఫలం హన్తి చన్ద్రయోగో విశేషత:
స్వఫలం ప్రదదాతీతి బుధో యత్నాద్ విచిన్తయేత్

ఈ చంద్రయోగ ఫలములు ఇతర యోగఫలములను నశింపజేయును. స్వఫలములనే యిచ్చును. బుద్ధిమంతులు యత్నపూర్వకముగ ఆలోచించి తెలుసుకొనవలెను.

సూర్యాత్ స్వాన్త్యోభయసెశ్చ బుధ శుక్రౌ యదియోగో
వేశి వాశి నామాఖ్యాచ తతోభయ చర: క్రమాత్

బుధ శుక్రులు సూర్యునికి ద్వితీయమందున్న వేసియోగము. ద్వాదశ మందున్న వాశియోగము, ద్వితీయ ద్వాదశములందున్న ఉభయచరయోగము అగును

సమదృక్ సత్యవా జ్మర్త్యో దీర్ఘ కాయో ఒలసస్తథా
సుఖభోగా ల్పవిత్తోపి వేశియోగ సముద్భవ:
వాశౌచ నిపుణో దాతా యశో విద్యా బలాన్విత:
తతోభయ చరే జాతోరాజోవా తత్సమ: సుఖీ

వేశియోగమున బుట్టినవారు సమదృష్టి – సత్యవక్త దీర్ఘ దేహముగల వాడు–అలసుడు–సుఖభోగ అల్ప ధనవంతుడు – అగును. వాశియోగమున బుట్టినవారు—నిపుణుడు – దాత – యశస్సు విద్యాబలములతో గూడినవాడు - అగును. ఉభయోచరమున బుట్టినవాడు రాజు లేదా రాజతుల్యుడు – సుఖీ అగును–శుభ గ్రహములవలన సంభవిస్తే యీ యోగములు శుభయోగము లగును. పాపగ్రహములవలన సంభవిస్తే పాపయోగములగును.

అనగా శుభులు కోణాధిపతులు-పాపులు తృతీయ సప్తమ లాభాధి పతులు. కాని నైసర్గిక శుభపాపములు ఇచట వర్తించవు.

శుభులున్న సాత్వికమైన ధర్మబుద్ధితో గూడిన యోగములగును. పాపులున్న కౄరమైన అధర్మ బుద్ధితోగూడిన యోగములగును.

సహస్రరశ్మిత శ్చన్ద్రే కేంద్రకోణ త్రికే క్రమాత్
ధన ధీ నైపుణాదీని న్యూన మధ్యోత్తమాని హి

సూర్యుని నుండి చంద్రుడు కేంద్రకోణ త్రికము లందున్నచో ధనము-బుద్ధి–నిపుణత్వం మొదలయినవి అధమమధ్యమోత్తమముగ క్రమముగ అగును,

అనగా సూర్యునికి చతుర్దశమములలో చంద్రుడున్న ధనము బుద్ధి-నిపుణత్వం తక్కువగును. చంద్రుడు సూర్యునికి కోణములందున్న అనగా

సూర్యునితోచేరి. లేదా సూర్యునికి పంచమము లేదా నవమమందున్న మధ్యమం త్రికములయిన ఆరు ఎనిమిది పండ్రెండులలో ఉన్న ఉత్తమము. ఇది నిశ్చయం.

దినార్ధాచ నిశార్ధాచ పరం సార్ధద్వినాడికా
శుభా వేలా తదుత్పన్నో రాజాస్యాత్త త్సమోపివా

మధ్యాహ్నము లేదా అర్ధరాత్రి. పైన రెండున్నర గడియల సమయంలో జన్మించినవారు రాజులగును లేదా రాజసమానులగుదురు.

ఇచట గుర్తించవలసిన ముఖ్య విషయం. రాత్రి బలరాసులలో జన్మించేవారు అర్థరాత్రిలో జననమందిన రాజయోగముండును. అటులనే దినబలరాసులలో మధ్యాహ్నమందు జనించిన వారు రాజయోగమును పొందుదురు లేదా అట్టి యోగమునకు సమానమైన యోగం పొందగలరు.

త్రికే నీచగ్రహాః శ్రేష్ఠాః నీచస్థావాత్రికాధిపాః
చతుష్టయేతుంగ ఖేటాః తుంగస్థావా తదీశ్వరాః

త్రికస్థానమందు నీచగ్రహములు శ్రేష్టమైనవి. త్రికాధిపతులు నీచయందున్ననూ శ్రేష్ఠం కేంద్రములందు (చతుర్థ దశమములందు) ఉచ్చగ్రహములు ఉచ్చస్థానాలను పొందిన చతుర్థ దశమాధిపతులు శ్రేష్ఠమైన ఫలములనిచ్చును.

త్రికేచతుష్టయేశానాః స్థితాశ్చేదల్పయోగదాః
విశేషాణాఽశుభాః పాపాత్రికేశేనాశ్చతుష్టయే

త్రికములందు చతుర్ధ దశమాధిపతులున్ననూ స్వల్పయోగ ప్రదులగుదురు. పాపులయిన త్రికాధిపతులు అనగా తృతీయ సప్తమ లాభాధిపత్యాలతో ఉన్న త్రికాధిపతులు చతుర్థ దశమములందున్న విశేషమైన అశుభఫలములనిచ్చెదరు.

నవగ్రహములు చారవశమున ద్వాదశ స్థానములందిచ్చు ఫలములు :

రవి :- స్థానభ్రష్టం భయం సంపన్మానభంగం మహద్భయం
శత్రుక్షయం వ్యథాంరోగం దుఃఖం సిద్ధిం ధనా ధనే
క్రమేణ జన్మరాశ్యాది కురుతే పద్మబాంధవః

జన్మరాశి మొదలు అనగా చంద్రుడున్నరాశి మొదలు (జాతకంలో) ద్వాదశా రాసులలో రవి సంచరించునపుడు ఇచ్చు ఫలములు– 1. స్థానభ్రష్టం 2. భయం 3. సంపద 4. మానభంగం 5. గొప్పభయం 6. శత్రుక్షయం 7. వ్యధ 8. రోగం 9. దుఃఖం 10. సిద్ది 11. ధనం 12. అధనం.

చం :- అన్నవృద్ధిం ధనక్షీణం ద్రవ్యలాభం మహద్రుజం
కార్యనాశంచ విత్తంచ ధనలాంభంచ మారణం
నృపవైరం సుఖం లాభం ధనహాని నిశాకరః
చంద్రుడు జన్మరాశిలో ఉన్న 1. అన్నవృద్ధి 2. ధనక్షీణం 3. ద్రవ్యలాభము 4. గొప్పరోగం 5. కార్యనాశం 6. ధనం 7. ధనలాభం 8. మరణం 9. నృపవైరం 10. సుఖం 11. లాభం 12. ధనహాని నృపవైరం అనగా వృత్తిలో అధికారులతో విరోధము.

కుజ :- భేదం దౌర్భాగ్యం సౌభాగ్య రిపుపీడాం రిపోర్భయం
అర్థసిద్ధి మనర్థంచ శస్త్రపీడాం ధనక్షయం
అశోకంచ ధనం క్రూరం క్రమేణకురుతే కుజః
కుజడు జన్మరాశిలో 1. భేదం 2. దుర్భాగ్యం 3. సౌభాగ్యం 4. శత్రువులవలన పీడ 5. శత్రుభయం 6. అర్థసిద్ధి 7. అనర్థము 8. శస్త్రములచే పీడ 9. ధనక్షయం 10. దుఃఖము లేకుండుట 11. ధనము 12. క్రూరము.

బుధ :- బంధనం హేమ లాభంచ శత్రుపీడాం రిపుక్షయం
దారిద్ర్యం భూషణం లాభం మనస్సిద్ధిం ధనక్షయం
ప్రమోదం మోద సంహారౌ క్రమేణకురుతే బుధః
బుధుడు జన్మరాశిలో 1. బంధనం 2. స్వర్ణలాభం 3. శత్రువుల వలన బాధ 4. శత్రుక్షయం 5. దరిద్రము 6. భూషణములు 7. లాభము 8. మనస్సిద్ధి 9. ధనక్షయం 10. ముదము 11. ముదము 12. మరణం.

గురు :- దేశత్యాగం విత్తలాభమ నర్థం ధననాశనం
సంపదం క్లేశమారోగ్యం ధనహానిం ధనాగమం
పీడనం లాభ నష్టే చ క్రమేణ కురుతే గురు:
గురువు జన్మరాశిలో ఉన్న 1. దేశత్యాగం 2. దనలాభము 3. అనర్థం 4. దననాశనము 5. సంపద 6. కష్టము 7. ఆరోగ్యము 8 దనహాని 9. ధనాగమము 10. పీడనము 11 లాభము 12. నష్టము.

శుక్ర :- ఆరోగ్యం భూషణం లాభం రతించ ప్రియదర్శనం
మానహానిం మహాపీడాం భూలాభం ధాన్యకుట్టణం
సంతోషం చైవవిత్తం చ ప్రమోదం కురుతేకవి:
శుక్రుడు జన్మరాశిలో ఉన్న 1. ఆరోగ్యం 2. భూషణములు 3 లాభం 4. స్త్రీ సంగమం 5. ప్రియులను దర్శించుట 6. మానహాని 7. మహాపీడ 8. భూలాభం 9. ధాన్యకుట్టణం 10. సంతోషం 11. ధనం 12. ప్రమోదం,

శని :- విపత్తి: హాని: సంపత్తి: కుక్షిరోగం సుతక్షయం
లక్ష్మీకరం మహాదైన్యం మరణం దేహశోషణం
బందనం లాభ నష్టే చ క్రమేణ కురుతే శని:

శని జన్మరాశిలో 1. ఆపద 2. హాని 3. సంపత్తి 4. కుక్షిరోగం 5. సుతక్షయం 6. ధనకరం 7. మహాదైన్యం 8. మరణం 9. దేహకష్టం 10. బంధనం 11. లాభం 12. నష్టం క్రమముగ చేయును.

ఇక రాహు కేతువుల విషయమున ప్రత్యేకముగ తెలుసుకొనవలెను. జాతకమందు ఏ భావాధిపతితో యుతిపొందిన ఆ భావాధిపతి ఫలములు ఇచ్చును. అలాగే ఆ భావాధిపతికి గోచారవశమున తెలిపినవి ఈ రాహు కేతువుల విషయమున గ్రహించవలెను. ఒకవేళ ఏ భావాధిపతితోనూ యుతి పొందనిచో వారున్న భావాధిపతికి గోచార విషయములో తెలిపినవి గ్రహించ వలెను.

ప్రతి దశ అంతరదశ అంతరాంతరదశ సూక్ష్మదశ ప్రాణదశ గ్రహ ములకు ఈ గోచార ఫలములను పరిశీలించి ఫలములు తెలిపినచో పరాజయ మనునది ఉండదు.

జాతకమందలి శుభాశుభ ఫలాలు తెలుసుకొనునపుడు ముందు తెలిపిన దశాధ్యాయం ప్రకారం దశ–అంతర్దశ-అంతరాంతర్దశ-సూక్ష్మదశ-ప్రాణదశ అను అయిదు దశలకు అధిపతులను తెలుసుకొనవలెను.

ఉదా :- గురు దశలో రాహు అంతరంలో బుధ అంతరాంతరంలో శుక్ర సూక్ష్మదశలో శని ప్రాణదశ. అనగ గురువులో రాహువులో బుధునిలో శుక్రునిలో శని అన్నమాట. ఇది సుమారు ఒకటి లేదా ఒకటిన్నర రోజులు వుంటుంది.

ఈ అయిదు గ్రహాలు గోచార వశమున లగ్నము నుండి- చంద్రుని నుండి (జనన జాతకమునకు) శుభస్థానాలందున్న శుభఫలములు - పాపస్థానా లందున్న పాపఫలాలు. మరియు వీరు జనన జాతకమందున్న గ్రహస్థితికి శుభపాపస్థానాలందున్న విషయం గుర్తించుకొనవలెను. అట్లే వీరిమధ్య గోచార విషయంలో పరస్పర సంబంధం చూడాలి. అలా చూచి శుభ పాపఫలములను నిర్ణయించవలెను.

—:o:—

# హోరా నిర్ణయ సంగ్రహము

ప్రస్తావన :-

పరాశరీయము రచించు ప్రయత్నములో ముఖ్యముగ పరాశర గ్రంథము అని చెప్పబడు ముద్రితాముద్రిత గ్రంథములు కొరకు అన్వేషించుచు లభ్యమైన గ్రంథములను తరచి చూడగ వాటియందు ప్రధానమైన కొన్ని దోషాలు తెలుస్తున్నాయి- ఉదాహరణకు :-

శ్లో॥ సర్వే త్రికోణ నేతారో గ్రహాః శుభఫల ప్రదాః
పతయః త్రిషడాయానాం యది పాపఫల ప్రదాః

అని పరాశర పేరుతో వున్న అన్ని గ్రంథము లందును ఉన్నది.

అనగా "అన్ని గ్రహాలు (రవి-చంద్ర-కుజ-బుధ-గురు-శుక్ర-శని) కోణాధిపతులై (1-5-9 భావాధిపతులయి) శుభఫలములు ఇచ్చువారగుదురు. మూడు-ఆరు-పదకొండు భావాలకు ఆధిపత్యం గలిగిన పాప ఫలాలు ఇచ్చువారగుదురు-" అని భావం.

దీనిని సూక్ష్మ పరిశీలన గావించిన ఇందు తెలిపిన మొత్తం ఆరు భావాలలోను లగ్న, పంచమ, నవమ, తృతీయ, లాభ భావాలు అయిదున్ను బేసి భావాలు. కేవలం 'షష్ఠ' భావం సరిభావం—అయిదు బేసి భావాలు తెలిపి ఒక్కటి సరిభావం ఎందుకైనది. మరియు శుభ భావాలు అని తెలిపిన లగ్న పంచమ, నవమ భావాలలో పంచమ నవమ భావాలకు సప్తమ స్థానాలు 'లాభ', 'తృతీయ' భావము లగుచున్నవి. మరి లగ్న భావమునకు సప్తమ స్థానంను తెలుపుటకు బదులు షష్ఠ స్థానంను తెలుపుట ఉచితం కాదు కదా! కనుక 'షష్ఠ' అను చోట 'సప్తమ' అని వాడినచో భావం సరిగ ఉండును.

ఏలన మూడు శుభ భావములైన లగ్న—పంచమ-నవమ భావాలకు సప్తమ స్థానములయిన 'సప్తమ-లాభ తృతీయ'ములు పాప భావము లగును. ఇవన్నియును బేసి భావములగును. కనుక పై శ్లోకంలో రెండవ పాదంలో 'త్రిషడాయా'కు బదులు 'త్రిమదాయ' అని వున్న సరిపోవును.

పరాశరేతరుల పద్ధతిలో 'సప్తమ' భావం కేంద్రం శుభమైనదనిన్ని 'షష్ఠ' భావం పాప భావ మనిన్ని ఉన్నందున ఇచట 'మద' అనుటకు బదులు 'షష్ఠ' అని వాడి ఉండవచ్చును. అలాగే సరి భావంలైన ఆరు భావాలలో కేవలం చతుర్థ దశమ భావాలు, కేంద్రాలు, లక్ష్మీస్థానములు శుభ మైనవనియు—మిగిలిన ద్వితీయ షష్ఠ—అష్ట—వ్యయ భావాలు అస్వతంత్రమని తెలిపెను.

అయితే ఇందలి లోపములను సరిచేసి తెలుపుటకు తగిన ఆధార గ్రంథములు కావలెను. ఆ ప్రయత్నంలో కొన్ని తాళపత్ర గ్రంథములలో కొన్ని ఆధారాలు ఉన్నవి. అయితే అవి కేవలం ఆరు సరి భావాలకు సంబంధించి వున్నవి. కాని పై తెలిపిన 'సప్తమ' భావాన్ని గురించిన వివరము 'బృహత్పరాశర హెూర శాస్త్రము (ప్రకాశకులు :- మెసర్స్ ఖేలాడి లాల్ సంకతా ప్రసాద్ మహెూదయైః, 61/82 బులానాలా వారణాసి-1) గ్రంథములో పుట 187 నందు 'త్రిమదాయా' అను ప్రయోగం ఇందలి భావమునకు సంబంధించి వున్నది. దాని నాధారం చేసుకుని 'పరాశర జ్యోతిషము' రచనకు పూనుకొనిన కాలంలో కావ్యకంఠ శ్రీ గణపతిముని (భగవాన్ శ్రీ రమణ మహర్షి అంతేవాసి) యొక్క 'హెూరా నిర్ణయ సంగ్రహము' వెలువడింది.

అందులో ప్రారంభంలో ఇలా వుంది :-

శ్లో- "ధీ స్తపో జన్మ కోణాని ప్రతీపంతు తదస్తభం-" అని. ఇది నా ఊహకు మరికొంత బలము నిచ్చినది. ఆ పుస్తకమును సమూలంగా దాని తెలుగు వ్యాఖ్యతో సహా చదివాను, తెలుగు వ్యాఖ్య మూలమునకు తగినట్లు లేదు. కొన్ని లోపాలున్నవి. కొన్ని తావులలో మూలంనకు వ్యతిరేకముగ వున్నది.

మూలగ్రంథం కేవలం పండితుల కొరకు తెలిపినటుల గ్రంథాంత్య శ్లోకం వలన తెలుస్తుంది. సామాన్య విద్యార్థికి కష్టముగ వుండును. అందువలన సామాన్యులకు గూడ సుబోధక మగునట్లు తెలుపవలెనన్న ఆకాంక్షతో దీనిని తెనిగించుటకు పూనుకుంటిని. ఇది పరాశర జ్యోతిషముతో ఎంతవరకు ఏకీభవించు చున్నదియు తెలుసుకొన గలము.

'దైవజ్ఞుల ముదముకొరకు సంగ్రహముగ తెలుపుచుంటిని' అని గ్రంథకర్త తెలిపెను. వివిధ నామములతో పిలువబడే లఘుపరాశరి కూడ సంగ్రహముగనే యున్నది. అయితే ప్రస్తుత యీ గ్రంథము సంగ్రహంగ ఉన్ననూ భావవివరణం చాల స్పష్టంగ ఉన్నది. సామాన్య విద్యార్థులకు సహితం సుబోధక మగునటుల, అవుసరమనుకొన్న తావులందు ప్రతిపదార్థము తెలుపుచు విషయ వివరణం వ్రాయడమైనది.

ఈ నా సంకల్పములో ఎంతవరకు కృతకృత్యుడ నైనది విజ్ఞులు తెలుపగలరు.

జి. విజయ్
13, నటేశన్ తెరువు,
టి. నగర్ - మద్రాసు-17

# 1. సామాన్య సంజ్ఞా అధ్యాయము

కల్యాణం కశ్చిదస్మాకం కరోతు జ్యోతిషాం పతిః
యస్య విష్ణు వధూ సౌధ కవాటోద్ఘాటనా కరాః 1

ఏ సూర్య కిరణములు, లక్ష్మికి నివాసమనబడు తామర పూవుయొక్క రేకులను తెరుచునో ఆ సూర్యుడు మనకు మంగళము గూర్చు గాక.

గ్రంధారంభంలో, కవి గ్రహరాజైన సూర్యుని మంగళకరమైన ఆశీస్సులుకై ప్రార్థించుట.

మతమాలోచ్య శాక్తస్య మహర్షే-దీర్ఘదర్శినః
దైవజ్ఞానాం ముదే కుర్మో హోరా నిర్ణయ సంగ్రహమ్ 2

దీర్ఘదర్శినః = దీర్ఘదర్శి అయిన; శాక్తస్య మహర్షే = (శక్తిపుత్రుడు) పరాశర మహర్షి; మతమ్ = మతమును; ఆలోచ్య = ఆలోచించి; దైవజ్ఞానాం = జ్యోతిష పండితుల; ముదే = ప్రీతి (ఆనందం) కొరకు; హోరా నిర్ణయ = హోరా నిర్ణయం; సంగ్రహమ్ = క్లుప్తముగ; కుర్మో = చేయుచుంటిని.

దీర్ఘదర్శి శక్తిపుత్రుడు అయిన పరాశర మహర్షి మతమును అవలోకించి హోరా నిర్ణయమును సంగ్రహముగ చేయుచుంటిని.

ఇది కేవలం పరాశర మహర్షిచే చెప్పబడిన జ్యోతిష శాస్త్రమని దానిననుసరించి చెప్పుచున్నటుల దీనివలన తెలియుచున్నది. శక్తి కుమారుడు అని దీర్ఘదర్శి అని తెలిపారు. అయితే ఈ గ్రంధమందు గ్రంధకర్తచే వాడబడిన కొన్ని పదములకు సరియైన అర్థములు ముందుగ తెలుపబడినవి- అవి:

పూర్ణాలోకశ్చ సంయోగో గ్రాహ్యా సంబంధ శబ్దతః
సంయోగమాత్రే సంయోగ–యోగ–సంసర్గ–సంగమాః 3

'సంబంధ' అను శబ్దం వాడినపుడు పూర్ణదృష్టి లేదా యుతి అని తెలుసుకొనవలెను. 'సంయోగ', 'యోగ', 'సంసర్గ', 'సంగమా' అను శబ్దములు వాడిన కేవలం సంయోగం (లేదా యుతి) అని మాత్రమే గ్రహించవలెను.

అనగా ఈ గ్రంధమందు గ్రహముల మధ్యగల సంబంధం తెలుపు నపుడు ఆ యా తావులలో 'సంబంధ' అను పదముకు గ్రహములయొక్క పూర్ణదృష్టి అని గాని యతి అని గాని తెలుసుకొనవలెను — అట్లే సంయోగ అని గాని యోగ అని గాని సంసర్గ అని గాని సంగమా అని గాని వాడిన కేవలం యుతి అని తెలుసుకొనవలెను.

గ్రాహ్యా పాదాది దృష్టిశ్చ దృష్టి వాచక శబ్దతః
శుభశ్చాతి శుభా దేవా దైత్యాః పాపాతి పాపినః 4

కేవలం 'దృష్టి' అని వాడినపుడు గ్రహముల మధ్యగల పాదదృష్టి లేదా అర్ధదృష్టి లేదా త్రిపాద దృష్టి లేదా పూర్ణ దృష్టి గ్రహించవలెను.

దేవ శబ్దమునకు అతి శుభులు లేదా శుభులు అనిన్ని దైత్య శబ్దముకు అతిపాప లేదా పాప అని తెలుసుకొనుము.

ఆ ప్రకారం ముఖ్యముగ ఇందు వాడిన శబ్దములకు అర్థములు గ్రహించవలెను.

అవి :— సంబంధః = పూర్ణదృష్టి లేదా యుతి; సంయోగ = యుతి; సంగమా = యుతి; యోగ = యుతి; సంసర్గ = యుతి. దృష్టి = పాద దృష్టి లేదా అర్ధ దృష్టి లేదా త్రిపాద దృష్టి లేదా పూర్ణ దృష్టి. దేవా = అతి శుభ లేదా శుభ. దైత్య = అతి పాప లేదా పాప.

ఈ ప్రకారం ఇకముందు చెప్పబోవు ప్రతి శ్లోకములోని పదములను చక్కగ పరిశీలించి భావమును తెలుసుకొనుము.

ధీ స్తపో జన్మ కోణాని ప్రతీపంతు తదస్తభం
త్రికం షష్ఠాష్టమాంత్యాని శేషో భోగ ఇహోచ్యతే 5

ధీః = బుద్ధి (పంచమభావం); తపః = తపస్థానం(భాగ్యభావం); జన్మ = లగ్నము, కోణాని = కోణములు, తదస్తభం = వాటి సప్తమ భావాలు; ప్రతీపంతు = ప్రతీపములు. అనగా వ్యతిరేకములు. షష్ట = ఆరవ భావం, అష్ట ఎనిమిదవ భావం, అంత్య = అఖరుది అనగా పన్నెండవ భావం, వీటిని త్రికం = త్రికములు అని. శేషాః = మిగిలినవి అనగా రెండు నాలుగు పది భావాలు, భోగ = భోగములు అని, ఇహ = ఇచట అనగా ఈ శాస్త్రమందు ఉచ్యతే = చెప్పబడును.

ఈ పరాశర శాస్త్రమైన హెూరా నిర్ణయమునందు లగ్న భావం, పంచమ భావం నవమ భావాలకు కోణములు అని పేరు. వీటి సప్తమ భావము లైనవి వరుసగా సప్తమ భావం-లాభ భావం-తృతీయ భావాలకు ప్రతీపాలని పేరు. షష్ఠ భావం, అష్టమ భావం, అంత్య లేదా ద్వాదశ భావాలకు త్రికము లని పేరు. ఇక మిగిలిన ద్వితీయ భావం, చతుర్ధ భావం, దశమ భావాలకు భోగములని పేరు.

1 5 9 లగ్నము నుండి కోణములగును. 3 7 11 ప్రతీపము లగును. 6 8 12 త్రికములగును. మిగిలిన 2 4 10 భోగములు ఆ ప్రకారంగ ద్వాదశ భావాలును నాలుగు ప్రధాన భాగాలుగ విభజింపబడెను. అందు బేసి భావాలు ఆరులో మూడు కోణాలు. మూడు ప్రతీపములు. అట్లే సరి భావాలు ఆరులో మూడు త్రికములు. మూడు భోగములు అని చెప్పబడెను.

| | | | |
|---|---|---|---|
| 12 | [1] | ·2· | (3) |
| (11) | | | ·4· |
| ·10· | | | [5] |
| [9] | 8 | (7) | 6 |

అయితే బేసి భావాలు అయిన కోణాలు ప్రతీపములు గాక సరిభావ ములు అయిన త్రికములు భోగములు చేర్చి రెండు ప్రధాన భాగాలుగ తెలి పెను. అవి ఇలా ఉంటాయి.

దక్షిణాః ధన షష్ఠాజ్ఞా సవ్యాః సుఖ మృతి వ్యయాః
రమాఽఽఖ్యౌ మాతృ దశమౌ విష్ణ్వాఖ్యౌ భాగ్య పంచమౌ 6

ధన = ద్వితీయ భావం-షష్ఠ = షష్ఠ భావం—అజ్ఞా = దశమ భావం— దక్షిణాః = దక్షిణములు, సుఖ = చతుర్ధ భావం, మృతి = అష్టమ భావం వ్యయ = ద్వాదశ భావం. సవ్యాః = సవ్యములు. మాతృ = చతుర్ధ భావం, దశమ = దశమ భావం రమాఖ్యౌ = లక్ష్మి స్థానములు అని చెప్పబడును. భాగ్య = నవమ భావం, పంచమ = పంచమ భావం; విష్ణ్వాఖ్యౌ = విష్ణు స్థాన ములు అని చెప్పబడును.

అనగా రెండు, ఆరు, పది భావాలు దక్షిణ సంజ్ఞ అని నాలుగు ఎనిమిది పన్నెండు భావాలు సవ్య సంజ్ఞ అని తెలుసుకొనుము. ఇక మరల నాలుగు, పది భావాలు రెండు మాత్రం లక్ష్మి స్థానములు అనిన్ని. పంచమ నవమ భావాలు రెండు విష్ణు స్థానములు అనిన్ని చెప్పబడును.

దీనిని కొంచెం సూక్ష్మ పరిశీలన గావించిన లగ్నము నుండి 1-5-9 భావాలు కోణములు. ఈ కోణములకు వరుసగ సప్తమ స్థానములు అయిన 7-11-3 భావాలు ప్రతీపములు. ఇవి ఆరున్ను బేసి భావాలు. ఇక కోణాలు అయిన 1-5-9 భావాలకు క్రమముగ తరువాత వచ్చు 2-6-10 భావాలు దక్షిణములు. అట్లే కోణాలయిన 1-5-9 భావాలకు క్రమంగ ముందువున్న 12-4-8 భావాలు సవ్యములు. ఆ ప్రకారంగ ద్వాదశ భావాలను నాలుగు భాగాలుగ విభజించెను.

మరొక విశేషం ఇందు బేసి భావాలు అయిన పంచమ, నవమ భావములు రెండున్నూ విష్ణు స్థానములనిన్నీ-సరిభావములయిన చతుర్థ-దశమ భావాలు రెండున్ను లక్ష్మీ స్థానములనిన్ని తెలిపెను. దీనిని గూర్చి పరాశరీయ మిట్లు తెలుపుచున్నది.

శ్లో॥ లగ్న పంచమ నవమాః శుభ సంజ్ఞా కోణాస్మృతాః
పంచమో నవమ స్తత్ర విశేషేణ శుభ ప్రదా॥
లగ్నం చతుర్థం దశమం సప్తమం కేంద్రాః ఖ్యాతాస్తు
తేషాం మధ్యే శుభౌ ప్రోక్తౌ కర్మ బంధూ సుఖప్రదౌ॥
తథా చత్వారో భావయోః కేంద్రకోణాః యోగ ప్రదాః

ఇది పరాశర పద్ధతిలో గల పాఠం. ఇతర పద్ధతులలో ఇట్లు తెలుపలేదు. అలా వివరము తెలుపకుండ కేవలం 'కేంద్ర కోణ సంబంధం' అని తెలిపిన లగ్నము. సప్తమ భావం గూడ కేంద్రాలుగ భావింపబడును. అటువంటి లగ్న, సప్తమ భావాలతో కోణాధిపతుల సంబంధం యోగ భంగమగును. కనుక కేంద్ర కోణ సంబంధం అనిన లక్ష్మీ-విష్ణు స్థానములు అని గ్రహించవలెను. అనగా కేవలం చతుర్థ, పంచమ, నవమ, దశమ భావాలు నాలుగు మాత్రమే గ్రహించవలెను,

ఈ గ్రంథకర్త ఇందు ఎచ్చటను 'కేంద్రము' అను పదం వాడకుండ కేవలం చతుర్థ, దశమములనే వాడెను.

పంచమస్యచ రాజ్యస్య ద్వితీయ శ్శత్రు రాత్మనః
వ్యయ శ్చతుర్థ తపసో ర్వ్యయం లగ్నస్య సస్మరమ్ 7

పంచమస్య = పంచమ భావంయొక్క. రాజ్యస్య = రాజ్య భావము యొక్క, ద్వితీయః = రెండవ భావమున్ను, చతుర్ధ = చతుర్ధ భావం యొక్క. తపసః = తొమ్మిదవ భావం యొక్కయు; వ్యయః = వ్యయ బావాలు లగ్నస్య = లగ్నము యొక్క; ద్వయం = రెండున్ను అనగా లగ్నముకు దాని రెండవ బావమున్ను, పన్నెండవ బావమున్ను, ఆత్మనః = తమకు, శత్రుః = శత్రువులు. స స్మరమ్ = సప్తమ బావంతో సహా.

షష్ఠ భావము పంచమ భావమునకున్ను-లాభ భావము దశమ భావమునకున్ను-తృతీయ భావము చతుర్ధ భావమునకున్ను-అష్టమ భావము భాగ్య భావమునకున్ను-ధన భావము, వ్యయ భావము రెండున్నూ లగ్న భావమునకును శత్రువులు. అట్లే ఈ భావములన్నింటికి వాటి సప్తమము శత్రు బావము. ఇంకను సులభముగ తెలుసుకొనవలె ననిన విష్ణు స్థానములైన పంచమ-నవమ బావములకు వాని సమీప త్రికములు శత్రువులగును అట్లే లక్ష్మి స్థానములైన చతుర్ధ దశమములకు వాటి సమీపమందున్న ప్రతీపములు శత్రువు లగును-లగ్నమునకు ఇరువైపుల నుండు ద్వితీయ వ్యయములు శత్రువులు. లగ్న-లక్ష్మి-విష్ణు స్థానములన్నిటికి వాటి సప్తమ భావములు శత్రువు లగును.

స్వతంత్రా అయుజో బావాః పరతంత్రా యుజో మతాః
కోణ భోగాః శుభాః ప్రోక్తాః శేషాః పాపాః స్వభావతః

అయుజో బావాః = బేసి బావములు (అనగా కోణములు - ప్రతీపములున్ను); స్వతంత్రా = స్వతంత్రమైనవి; యజో మతా = సరి భావములు (అనగా భోగములు త్రికములు); పరతంత్రాః = అస్వతంత్రములు అయినవి; కోణ భోగాః = కోణములు, భోగములు; శుభాః = శుభమైనవి; శేషాః = మిగిలినవి అనగా త్రికములు, ప్రతీపములు; పాపాః = పాపమైనవి. అని స్వభావతః = స్వాబావికముగ; ప్రోక్తాః = చెప్పబడును.

ఫలితముల నిచ్చుటలో బేసి బావములైన కోణాలు-ప్రతీపములు స్వతంత్రమైనవి-అందు కోణాలు శుభమైనవి. ప్రతీపములు పాపమైనవి - సరి భావాలైన భోగాలు, త్రికములు అస్వతంత్రమైనవి. అందు భోగాలు

శుభమైనవి. త్రికములు పాపమైనవి. లగ్న-పంచమ-నవమ భావములు బేసి భావాలు కోణాలు స్వతంత్రంగ శుభ ఫలముల నిచ్చును. **తృతీయ-సప్తమ-లాభ** భావాలు ప్రతీపములు బేసి బావాలు స్వతంత్రముగ పాప ఫలాల నిచ్చును. షష్ఠ-అష్టమ-వ్యయ బావాలు సరి భావములు త్రికములు. అస్వతంత్రములు అశుభ ఫలములిచ్చును. ద్వితీయ-చతుర్థ దశమ బావాలు సరిబావాలు, భోగాలు,అస్వతంత్రములు. శుభఫలాలనిచ్చును.

నిసర్గపద సద్భావే పాపా సూర్య సుతాదయః
శుభాః గుర్వాదయ శ్చేతి జ్ఞేయం సామాన్య శాస్త్రతః 9

నిసర్గ పద సద్భావే = నైసర్గిక అను పదముచే, పాపాః = పాపులు, సూర్య సుతాదయః = సూర్య సుతుడు (శని) మొదలగువారు; శుభాః = శుభులు గుర్వాదయః = గురువు మొదలైన వారు అని. ఇతి = ఈలాగున, జ్ఞేయం = తెలుసుకొన గలరు. సామాన్య శాస్త్రతః = సామాన్య శాస్త్రములవలన.

నైసర్గిక పాపులు శని-కుజ-రవులు అని నైసర్గిక శుభులు-గురు-శుక్ర-బుధ-అనియు, సాధారణమైన ఇతర శాస్త్రముల ప్రకారం తెలుసుకొనవలెను అని. అయితే ఈ పరాశర శాస్త్రమందు నైసర్గిక శుభపాపుల ప్రస్తావన వుండదు. కేవలం పైన తెలిపిన అధిపత్యం వలన కలిగిన శుభత్వం పాపత్వం గ్రహించవలెను.

ఫలా న్యతి శుభాదీనాం దశాస్వేవ వినిర్దిశేత్
కాలా నపేక్షం వక్తవ్యం రాజయోగాది జాతకే 10

జాతకే = జాతకమందలి-ఫలాని = ఫలితాలను అతిశుభాదీనాం = అతి శుభులు మొదలగు-దశాస్వేవ = దశలయందే- వినిర్దిశేత్ = నిర్దేశించవలెను. రాజయోగాదికమ్ = రాజయోగాది ఫలాలు కాలా నపేక్షం = కాలంతో నిమిత్తం లేకుండ-వక్తవ్యం = చెప్పవలెను.

జాతకానికి ఫలితాలు చెప్పునపుడు అతిశుభ-శుభ-పాప-అతిపాప అను గ్రహాల దశల యందే తెలుపవలెను. (ఇవి రాబోవు అధ్యాయాలందు తెలుపబడును) ఇక రాజయోగాది ఫలాల విషయంలో కాలంతో నిమిత్తం లేకుండ తెలుపవలెను.

శ్రీపతేః షడ్విధ వీర్యం సంజ్ఞారిష్టే వరాహతః
ఫలాని విందన్నేతస్మా ద్దైవజ్ఞో విజయీ భవేత్ 11

శ్రీపతి చే చెప్పబడిన షడ్విధ బలసాధన వలన వరాహమిహిరునిచే చెప్పబడిన సంజ్ఞా అరిష్టాలు తెలుసుకుని ఇచట చెప్పబడిన ఈ శాస్త్రప్రకారం ఫలితాలు తెలుపు జ్యోతిష్కుడు విజయం పొందును.

అనగా శ్రీపతి భట్టాచార్యునిచే తెలుపబడిన గ్రహాల షడ్బల సాధన గావించి-వరాహ మిహిరాచార్యునిచే తెలుపబడిన సంజ్ఞా అధ్యాయమున్ను-బాలారిష్టా అధ్యాయమున్ను క్షుణ్ణంగ తెలుసుకుని ఇచట ఈ హోరానిర్ణయ సంగ్రహంను అనుసరించి ఫలితాలు చెప్పు జ్యోతిష్కుడు విజయం పొందును.

ఇచట తెలిపిన సామాన్య సంజ్ఞలు: ద్వాదశ భావాలున్ను రెండు ప్రధాన భాగాలుగ విభజింపబడెను. అవి: ఆరు బేసి భావాలు స్వతంత్ర మైనవి, ఆరు సరిభావాలు-అస్వతంత్రమైనవి. బేసి భావాలు మరల కోణాలు (1-5-9) అనిన్ని-ప్రతీపములు (3-7-11) అనిన్ని రెండు భాగ ములు-అట్లే సరిభావాలలో త్రికంలు (6-8-12), భోగాలు (2-4-10) అని రెండు భాగాలు-కోణాలు-భోగాలు శుభమైనవి-త్రికంలు- ప్రతీపములు పాపమైనవి. చతుర్థ దశమ భావాలు లక్ష్మీస్థానాలు పంచమ నవమ భావాలు విష్ణుస్థానాలు. 1-5-9 భావాలు కోణాలు. స్వతంత్రమైనవి. 2-6-10 భావాలు దక్షిణాలు, అస్వతంత్రములు. 3-7-11 భావాలు ప్రతీపములు, స్వతంత్ర మైనవి. 4-8-12 భావాలు. సవ్యములు. అస్వతంత్రము. 6-8-12 భావ ములు త్రికములు, అస్వతంత్రం. 2-4-10 భావాలు భోగాలు. అస్వతం త్రములు.

లక్ష్మీ స్థానమునకు సమీప మందున్న ప్రతీపం. ఆ లక్ష్మీస్థానంకు శత్రువగును. విష్ణుస్థానముకు సమీపమందు ఉన్న త్రికము ఆ విష్ణు స్థాన ముకు శత్రువగును లగ్నమునకు ద్వితీయ ద్వాదశాలు శత్రువులగును.

ఏ రాశి లగ్నమైనను లగ్న పంచమ నవమ భావాలు తదధిపతులు శుభులు. తృతీయ, సప్తమ, లాభ భావాలు తదధిపతులు పాపులు. షష్ఠ, అష్టమ, వ్యయాధిపతులు అశుభులు. ద్వితీయ, చతుర్థ, దశమములు శుభులు.

ఇక గ్రహాలు శని. కుజ, రవి నైసర్గిక పాపులు. గురు, శుక్ర, బుధ, నైసర్గిక శుభులు. చంద్రుడు పౌర్ణమికి శుభుడు. అమావాశ్యకి పాపి-మధ్యలో

త్రైరాశికం వలన లెక్కించి నిర్ణయించవలెను. ఈ నైసర్గిక శుభ-పాప నిర్ణయాలు ఈ పరాశర గ్రంథమందు అధిక ప్రాధాన్యత లేదు కేవలం అధిపత్యం వలన శుభ-పాప నిర్ణయంచే ప్రాధాన్యం పొందును.

ఇవి సామాన్య సంజ్ఞలు.

## 2. విశిష్ట సంజ్ఞా అధ్యాయము

ముందు ప్రథమాధ్యాయంలో కేవలం **సామాన్య** సంజ్ఞలు తెలుపబడెను. ఈ అధ్యాయమున విశిష్ట సంజ్ఞలు తెలుపబడును. ఇతర ఋషి మతాలకు పరాశర మతమునకు గల ప్రధాన వ్యత్యాసాలు ఈ రెండు అధ్యాయాలందు కలదు. దీనిని క్షుణ్ణంగ తెలుసుకొననిచో ముందు అధ్యాయాలు తెలుసుకొనుట కఠినమగును.

కోణ భోగ పతిః కోణ త్రికే ద్భోగ ప్రతీపపః
త్రిక ప్రతీపపో భౌమ ముఖ్యే ష్వతి శుభాదయః 1

భౌమ ముఖ్యేషు = కుజాది గ్రహాలకు-కోణ భోగపతిః = కోణాధిపత్యం భోగాధిపత్యం, కోణ త్రికః = కోణాధిపత్యం, త్రికాధిపత్యం, భోగప్రతీపపః = భోగాధిపత్యం, ప్రతీపాధిపత్యం-త్రిక ప్రతీపపః = త్రికాధిపత్యం ప్రతీపాధిపత్యం (కలిగిన), అతి శుభాదయః = అతిశుభుడు మొదలగునవి అగును.

అనగా కుజాది తారాగ్రహాలు (కుజుడు, బుదుడు, గురువు, శుక్రుడు, శని అగుదురు). ఈ గ్రహాలకు మాత్రం రెండు భావములకు ఒకేమారు అధిపత్యముండును. అందు ఒకటి బేసి భావమునకు రెండవది సరిభావమునకు ఉండును. ఇందు ఏ గ్రహమునకు ఒకేమారు రెండు బేసి భావాలకు గాని రెండు సరిభావాలకు గాని అధిపత్యముండదు.

ఆ ప్రకారంగ ఈ అయిదు గ్రహాలకు కోణాధిపత్యం, భోగాధిపత్యం కలిగినచో అతి శుభుడగును.

కోణాధిపత్యం త్రికాధిపత్యం కలిగినచో శుభుడగును.

ప్రతీపాధిపత్యం భోగాధిపత్యమున్ను కలిగిన పాపియగును.

ప్రతీపాధిపత్యం-త్రికాధిపత్యమున్ను కలిగిన అతి పాపియగును.

ఆ ప్రకారంగ ఆధిపత్యం వలన కుజాది పంచగ్రహాలు అతిశుభ, శుభ, పాప, అతిపాప అను నాలుగు వర్గాలుగ విభజింపబడెను.

అపి స్వభావతః పాపం పరతంత్రతయా త్రికమ్
కోణేన బలినా శ్లిష్టం భవతి క్షీణ విక్రమమ్ 2

స్వభావతః = స్వాభావికంగ, పరతంత్రతయా = అస్వతంత్రం వలన, త్రికమ్ = త్రికములు (అధిపతి). పాపం అపి = పాపమైనవి అయినప్పటికి, బలినా = బలీయమైన (స్వతంత్రమైన). కోణేన = కోణముల (ఆధిపత్యం), శ్లిష్టం = కలిసి యుండుటచే, విక్రమమ్ = పరాక్రమం (పాపమనెడి) నుండి క్షీణ = క్షీణించినవారై–భవతి = అగుచున్నారు.

స్వతస్సిద్ధంగ త్రికములు పాపమైనవని చెప్పబడెను. అస్వతంత్రమైన అట్టి త్రికములకు ఆధిపత్యం గల గ్రహాలకు కోణాధిపత్యం కూడ వున్నచో ఆ త్రికాధిపతులు పాపత్వం క్షీణించి శుభులగుచున్నారు. కనుకనే కోణాధిపత్యం త్రికాధిపత్యం గల గ్రహము శుభమైనదని తెలిపెను (శ్లో-1).

పరతంత్రతయా భోగః స్వభావేన శుభోఽపిసన్
పాప ప్రతీప సంశ్లేషా ద్భవతి స్వగుణా చ్యుతిః 3

స్వభావేన = స్వభావం వలన, పరతంత్రతయా = అస్వతంత్రమైన–భోగః = భోగాలు (అధిపతులు), శుభోఽపిసన్ = శుభమైన వైనప్పటికి, పాప ప్రతీప = పాపమైన ప్రతీపములు (ఆధిపత్యం). సంశ్లేషాత్ = కలియుటవలన, స్వగుణాత్ = స్వకీయమగు (శుభ) గుణము నుండి, చ్యుతః = పడిపోయినవారై భవతి = అగుచున్నారు.

అస్వతంత్రమైన దగుటచే. శుభమైనదైనను భోగాధిపతికి స్వతంత్ర పాపాధిపత్యమైన ప్రతీపాధిపత్యం కూడ కలిగిన అట్టి భోగాధిపతి శుభత్వం కోల్పోయి పాపి అగుచున్నాడు.

కనుకనే ప్రతీపాధిపత్యం, భోగాధిపత్యం గల గ్రహం పాపమైన దని తెలిపెను–(శ్లో-1).

తనోః సామాన్యతో మిత్ర మపి శత్రు ర్విశేషతః
ద్వితీయో ఽత స్తయో రీశో నామ్నాగ్ర్యో ఽనంతరఫలే 4

ద్వితీయః = ద్వితీయ భావం. అతః = పిమ్మట, తయోరీశః = దాని అధిపతి (ద్వితీయాధిపతి), తనోః = తను భావం (లగ్నము)కు, సామాన్యతః = సామాన్యంగ, మిత్రమపి = మిత్రులైననూ, విశేషతః = విశేషించి = శత్రుః = శత్రువగును, నామ్నా = పేరుకు మాత్రం, అగ్ర్యః = అధికులు, ఫలే = ఫలితములిచ్చుటలో, అనన్తరః = తర్వాతివారే.

లగ్నముకు లగ్నాధిపతికి, ద్వితీయం ద్వితీయాధిపతి మిత్రులయినను, పేరుకు మాత్రము అధికులు. కాని ఫలితముల నిచ్చుటలో మాత్రము శత్రువు అగును.

ఇది సరిరాసులు లగ్నములైనపుడు మాత్రమే వర్తించును.

ముందు రాబోవు అధ్యాయములలో ద్వితీయము మారక స్థానముగ చెప్పబడును.

కోణాని స్వసమీపస్థ త్రికయుంజి శుభాని చేత్
నా న్వయాద్భావ శ కీనాం ద్వేషి స్వవ్యయయోః క్షయాత్ 5

కోణాధిపతులు తమకు సమీపమందున్న త్రికాధిపతులతో చేరినను, సమీప త్రికములం దున్నను శుభమును చేయజాలరు.

అనగా ల్నకోణాధిపతి వ్యయమందు ఉన్నను; వ్యయాధిపతితో కలిసినను శుభఫలముల నీయజాలడు. కాని షష్ఠాధిపతితో కలసిననూ అష్టమాధిపతితో కలిసినను లేదా షష్ఠాష్టమములం దున్నను దోషం లేదు.

పంచమ కోణాధిపతి షష్ఠమందున్నను షష్ఠాధిపతితో యుతి పొందినను దోషము. అష్టమ, వ్యయములం దున్నను, వాటి అధిపతులతో యుతి పొందినను దోషం లేదు.

భాగ్య కోణాధిపతి అష్టమ మందున్నను అష్టమాదిపతితో యుతి పొందినను దోషము. కాని వ్యయమందు షష్టమందు ఉన్నను వాటి అధిపతులతో యుతి పొందినను దోషం లేదు.

ఇంతవరకు ద్విరాశ్యాధిపతులైన కుజాది పంచ తారాగ్రహాల ఆధిపత్య వివరములు చెప్పబడినవి. ఇక మండల గ్రహములైన రవి, చంద్రుల ఏక రాశ్యధిపత్యం గూర్చి ఇట్లున్నది :-

భాస్వతో దక్షిణాః సవ్యాః శీతాంశో సవ్య దక్షిణాః
శుభాఽశుభౌ ద్వయోః కోణ ప్రతీపేతి శుభాఽశుభే 6

భాస్వతో = సూర్యునికి, దక్షిణాఃసవ్యాః = దక్షిణములు సవ్యములు, శీతాంశోః = చంద్రునికి; సవ్యదక్షిణాః = సవ్యములు దక్షిణములు; శుభాఽశుభాః = శుభములు అశుభములు అగును. ద్వయోః = ఇరువురకు (సూర్య చంద్రులకు), కోణ ప్రతీపః = కోణాలు ప్రతీపములు; శుభాఽశుభే = శుభములు అశుభములు.

రవి-చంద్రు లిరువురకు కోణాధిపత్యం శుభమైనది. ప్రతీపాధిపత్యము పాపమైనది. సరిభావములైన సవ్యములు (4-8-12 భావములు) ఆధిపత్యం చంద్రునికి శుభమైనవి రవికి పాపమైనవి. దక్షిణములు ( 2-6-10 భావములు) ఆధిపత్యం చంద్రునికి పాపమైనవి-రవికి శుభమైనవి.

తరువాత శ్లోకములలో వీని వివరము తెలిపెను.

షష్ఠ నాథ సహస్రాంశుః చంద్రో రంధ్రాంత్య నాయకః
లగ్ననాథ సుహృత్వేన నపాపా విత్యత శుభౌ 7

లగ్ననాథ: = లగ్నాధిపతికి, సుహృత్వేన = మిత్రులగుట వలన సహస్రాంశు: = సూర్యుడు, షష్టనాథ: = షష్టాధిపతి అయి; చంద్ర: = చంద్రుడు, రంధ్ర = అష్టమమునకు, అంత్య = వ్యయమునకు, నాయక: = అధిపతి అయి, నపాపావితి = పాపఫలమీయరు. అత: = అనంతరము, శుభౌ = ఇరువురు శుభులగుచున్నారు.

మీన లగ్నమునకు రవి షష్ఠాధిపతియైనను పాపికాడు. అటులే ధను ర్లగ్నముకు అష్టమాధిపతియై. సింహలగ్నముకు వ్యయాధిపతియై చంద్రుడు పాపికాడు సరికదా ఆ యా లగ్నములకు వారు శుభు లగుచున్నారు. లగ్నాధిపతికి మిత్రు లగుటవలన.

లగ్న నాథా ఽసుహృత్వేన దౌర్బల్యాదపి తద్దిశి
నశుభా విత్యత: పాపా విమౌ వాహన కర్మపౌ 8

లగ్ననాథ = లగ్నాధిపతికి, అసుహృత్వేన = మిత్రులు కానందున. ఇమౌ = ఈ ఇరువురు, వాహన కర్మపౌ = చతుర్థ దశమాధిపతులు-దౌర్బల్యా

దపి = దుర్బలులై–తద్దిశి = ఆ విధంగ, నశుభా = శుభులు కాజాలరు, అత: = అనంతరము, పాపావితి = ఈ విధంగ పాపులగుచున్నారు.

అనగా వృషభ లగ్నముకు చతుర్థాధిపతియై రవియున్ను, తులా లగ్నముకు దశమాధిపతియై చంద్రుడున్ను, లగ్నాధిపతియైన శుక్రునికి శత్రువు లగుటవలన ఆ లగ్నములకు వారు శుభఫలముల నీయజాలరు. పైగా పాప ఫలముల నిచ్చెదరు.

తరువాత ఛాయాగ్రహములైన రాహు కేతువుల గురించి తెలిపెను.

ఫలే తమోగ్రహౌస్యాతాం సంబద్ధ గ్రహసన్నిభౌ
తదభావే సమారూఢ రాశినాయక సన్నిభౌ 9

తమోగ్రహౌ = రాహు కేతువు లిరువురు, ఫలే = ఫలితములిచ్చుటలో సంబద్ధ గ్రహ సన్నిభౌ = తమతో యుతి పొందిన గ్రహముల యొక్క ఫలములను, స్యాతాం = చేయుదురు. తదభావే = అట్టి యుతి లేనియెడల–సమారూఢ = ఆ రాహుకేతువులుండు, రాశి నాయక: = రాశ్యధిపతికి, సన్నిభౌ = సంబంధించిన ఫలము లిచ్చెదరు.

అనగా రాహుకేతువులు ఛాయా గ్రహములైనందున వాటికి భావాధిపత్యం చెప్పబడలేదు. రాహు–కేతువులు ఏ భావాధిపతితో యుతి పొందిన ఆ భావాధిపతి ఫలితము ఇచ్చెదరు–ఇది సంభవించనిచో వారున్న భావాధిపతి యొక్క ఫలములకు సమమైన ఫలము లిచ్చెదరు.

ఇచట ఈ విశిష్ట సంజ్ఞా అధ్యాయమున తొమ్మిది గ్రహములను మూడు వర్గములుగ విభజించెను.

రవి–చంద్రులు (మండల గ్రహములు) ఒక్కొక్క రాశికి అధిపతులగుచున్నారు. వీరికి కోణాధిపత్యం (1–5–9) శుభము, ప్రతిపాధిపత్యం (3-7-11) పాపము.

రవికి దక్షిణాధిపత్యం (2-6–10) శుభము. అనగా కటక లగ్నముకు ద్వితీయాధిపత్యం, మీనలగ్నముకు షష్ఠాధిపత్యం. వృశ్చిక లగ్నముకు దశమాధిపత్యం శుభం. సవ్యాధిపత్యం (4–8-12) పాపము. అనగా వృషభ లగ్నముకు చతుర్థాధిపత్యమున్ను. మకర లగ్నముకు అష్టమాధిపత్యమున్ను కన్యా లగ్నముకు వ్యయాధిపత్యమున్ను అయి పాపి యగును.

చంద్రునికి సవ్యాధిపత్యం (4–8–12) శుభము అనగా మేషలగ్నంకు చతుర్థాదిపత్యం. ధనుర్లగ్నముకు అష్టమాదిపత్యం సింహలగ్నముకు వ్యయాది పత్యం కలిగి శుభమగును. దక్షిణాదిపత్యం (2-6–10) అనగా మిధున లగ్నముకు ద్వితీయాదిపత్యం కుంభలగ్నముకు షష్ఠాదిపత్యము–తులా లగ్న ముకు దశమాదిపత్యం కలిగి పాపి యగును.

2. కుజాది పంచగ్రహాలు (తారాగ్రహము) రెండేసి భావాలకు అధి పతులగుచున్నారు. అందు ఒకటి బేసి భావం రెండవది సరిభావం అగును– శుభాఽశుభత్వ నిర్ణయములో బేసిభావ అధిపత్యమునకే ప్రాధాన్యమివ్వబడెను. బేసి భావం సరిభావం రెండు శుభమైన అతిశుభుడగును. అనగా కోణాదిపత్య మున్ను(1-5-9) భోగాదిపత్య (2-4-10) మున్ను కలిగి యుండును. కోణాది పత్యం (శుభం) త్రికాధిపత్యం కలిగిన శుభుడగును. బేసి భావము ప్రతీపము (3-7-11) రెండవది సరిభావం శుభమైన (2–4–10) పాపి యగును. ప్రతీపం (3-7-11) పాప అదిపత్యమున్ను రెండవది త్రికాదిపత్యం (6-8–12) పాప అదిపత్యమున్ను కలిగిన అతి పాపియగును.

ఆ విధంగ రెండు భావములకు ఆదిపత్యం వలన అతిశుభ–శుభ-పాప- అతిపాప అని నాలుగు వర్గాలుగ విభజింపబడెను.

3. ఛాయాగ్రహాలైన రాహు కేతువులకు ఆదిపత్యం చెప్పలేదు. వారు ఏ భావాదిపతితో చేరిన ఆ భావాదిపతి ఫలము లేదా ఏ భావమందున్న ఆ భావ అధిపతి ఫలము ఇచ్చెదరు.

ఇందలి సూక్ష్మము :–

అన్ని లగ్నాలకు 1–5–9 కోణాలు శుభము, 3-7–11 ప్రతీపములు పాపము. బేసి రాసులు (మేషము నుండి)లగ్నములయిన వాటికి దక్షిణములు (2-6–10 భావములు) శత్రువులు-సవ్యములు (4-8.12 భావాలు) మిత్రులు–సరిరాసులు లగ్నములైనచో దక్షిణములు (2–6–10) మిత్రులు. సవ్యములు (4-8–12) శత్రువులు అగును.

పరాశర పద్ధతికిన్ని పరాశరేతరుల పద్ధతికిన్ని వ్యత్యాసం ముఖ్యంగ గమనించదగినది ఇదే.

పరాశర పద్ధతిలో ద్వాదశ భావాలున్ను నాలుగు ప్రధాన భాగాలుగ విభజించబడినవి. అవి కోణాలు, ప్రతీపాలు, త్రికములు, భోగాలు అని కోణాలు, భోగాలు శుభమైనవి ప్రతీపములు, త్రికములు పాపమైనవి. భావము లకు గల గ్రహ అధిపత్యం వలన శుభ–పాప నిర్ణయం జరిగెను. మొత్తం ఫలభాగం భావాదిపత్యంపైననే ఆధారపడి వున్నది.

పరాశరేతరులు ద్వాదశ భావాలను మూడు ప్రధాన భాగాలు గావించిరి. 1. కేంద్రాలు, (1–4–7–10 భావాలు) పణఫరములు (2–5–8-11), అపోక్లిమములు (3–6-9-12) అలాగే గ్రహాలు శుభులు గురు, శుక్ర, బుధ, పూర్ణచంద్రులు. పాపులు శని, కుజ, రవి, క్షీణ చంద్రులు అని. కోణాలకు ఇందు ప్రాధాన్యం లేదు. ఆ ప్రకారంగానే ముందు రాబోవు అధ్యాయాలలో ఆయుర్భావ విచారణ కూడ భేదించును.

## 3. ఉదాహరణాధ్యాయము

పై రెండు ఆధ్యాయాలందు తెలిపిన సంజ్ఞలు ఆధారంగా ఇచట ద్వాదశ రాసులు లగ్నములైనచో ఏ లగ్నంకు ఎవరు శుభులు ఎవరు పాపులు తెలుసుకుందాము :-

మేషస్య సూర్యో జీవారచంద్రా సౌరిసితౌ బుధః
శనిజ్ఞో భార్గవో భానుః చంద్రారగురువో వృషే 1
యగ్మస్య సౌమ్య శుక్రార్కి చంద్రేజ్యౌ రవిభూసుతౌ
భౌమేందూ జీవభాస్వంతౌ శుక్రో జ్ఞార్కిచ కర్కిణి 2
భౌమార్కౌ గురుసీతాంశూ శుక్రసౌమ్యౌ శనిర్హరౌ
స్త్రీయాం సితబుధౌ మందో గుర్వార్కౌ విందుభూసుతౌ 3
మన్దో జ్ఞశుక్రౌ చంద్రారౌ సూర్యజీవౌచ తౌలిని
చంద్రజీవౌ రవికుజౌ మన్దః శుక్రబుధా వళౌ 4
ధను ష్యర్కగురూ భౌమచంద్రౌ బుధశనీ సితః
శుక్రమన్దౌ బుధో భౌమరవీ చంద్రగురూ మృగే 5
ఘటే శుక్రో బుధశనీ భౌమేన్దుగురువో రవిః
కుజేన్దు గురవః సూర్యో బుధః శనిశితౌ ఝషే 6

ద్వాదశానా మతి శుభాః క్రమా దేవం శుభా అపి
పాపిన శ్చాతి పాపాశ్చ లగ్నానాం సముదాహృతాః 7

మేషస్య = మేష (లగ్నముకు) సూర్యుడు అతిశుభుడు గురుకుజ చంద్రులు శుభులు శని శుక్రులు పాపులు బుధుడు అతిపాపి.

వృషభల్నముకు--శని బుధులు అతిశుభులు, శుక్రుడు శుభుడు, రవి పాపి, చంద్రకుజగురువులు అతి పాపులు. మిథున లగ్నముకు—బుధుడు అతి శుభుడు. శుక్ర శనులు శుభులు. చంద్ర గురువులు పాపులు. రవి కుజులు అతి పాపులు. కర్కాట లగ్నముకు— కుజ చంద్రులు అతి శుభులు, గురు రవులు శుభులు. శుక్రుడు పాపి, బుధ శనులు అతి పాపులు. సింహలగ్నముకు కుజ రవులు అతి శుభులు. గురు చంద్రులు శుభులు. శుక్ర బుధులు పాపులు—శని అతిపాపి. కన్యాలగ్నమునకు శుక్ర బుధులు అతి శుభులు-శని శుభుడు, గురు రవులు పాపులు. చంద్ర కుజులు అతి పాపులు. తులా లగ్నమునకు శని అతి శుభుడు. శుక్ర బుధులు శుభులు, చంద్ర కుజులు పాపులు,గురు రవులు అతి పాపులు. వృశ్చిక లగ్నమునకు చంద్ర గురువులు అతి శుభులు. రవి కుజులు శుభులు. శని పాపి, శుక్ర బుధులు అతి పాపులు. ధనుర్లగ్నమునకు రవి గురువులు అతిశుభులు. కుజ చంద్రులు శుభులు. బుధ శనులు పాపులు శుక్రుడు అతి పాపి. మకర లగ్నముకు శుక్ర శనులు అతి శుభులు బుధుడు, శుభుడు, కుజ రవులు పాపులు చంద్ర గురువులు అతి పాపులు. కుంభలగ్నము నకు శుక్రుడు అతి శుభుడు. బుధ శనులు శుభులు. కుజ చంద్ర గురువులు పాపులు, రవి అతి పాపి. మీనలగ్నమునకు కుజ చంద్ర గురువులు అతి శుభులు, రవి శుభుడు, బుధుడు పాపి, శని శుక్రులు అతి పాపులు.

సాముదాయకముగ పన్నెండు లగ్నములకు క్రమముగ అతి శుభులు శుభులు పాపులు, అతి పాపులు అగుచున్నారు.

ఇచట గమనించ వలసినది ముఖ్యంగ ఛాయా గ్రహములయిన రాహు కేతువులకు స్థానం లేదు.

యథా పూర్వం బలం జ్ఞేయం ప్రతియోగం సుపర్వణాం
యథో త్తరంచ దైత్యానాం తారతమ్య పరీక్షణే 8

ప్రతియోగం = ప్రతియోగమందును (యుతి యందు) సుపర్వణాం = అతిశుభ, శుభులలో, దైత్యానాం = పాపాతి పాపులలో, తారతమ్య పరిక్షణే = ఎక్కువ తక్కువలు పరీక్షించుటలో, యథా పూర్వం = ముందు తెనిపినట్లు- యథోత్తరం = ఉత్తరోత్తర క్రమమున, బలం = బలమును, జ్ఞేయా తెలుసు కొనుము.

ప్రతి యోగమందును బలవ్యత్యాసము తెలుసుకొనునపుడు పైన తెలిపిన విధముగ అతి పాపికన్న పాపి–పాపికన్న శుభుడు, శుభునికన్న అతి శుభుడు బలీయులు అని తెలుసుకొనుము. ఇచట 'సుపర్వణాం' అనగా శుభాతిశుభులు 'దైత్యానాం' అనగా పాపాతి పాపులు.

దీనిని తేలికగ తెలుసుకొనుటకు ద్వాదశ లగ్నములకు ఎట్లు వర్తించునో ఒక పట్టిక రూపమున అమర్చి చూచిన తెలియగలదు.

శని శుక్ర బుధ ర్క్షాణా మితరే దైత్య సంజ్ఞికాః
త్రయస్తే చేతర ర్క్షాణాం దైత్య భిన్నా దివౌకసః

శని, శుక్ర, బుధర్క్షాణాం = శని శుక్ర బుధ క్షేత్రములకు, ఇతరే॥ 6
ఇతరములు (రవి, చంద్ర, కుజ, గురు, క్షేత్రాలు), దైత్య సంజ్ఞకాః = పాపాతి పాప సంజ్ఞ కలవి, త్రయస్తే = ఆ మూడు క్షేత్రాలు (శని, బుధ, శుక్ర క్షేత్రాలు), ఇతరర్క్షాణాం = ఇతర క్షేత్రాలకు (రవి, కుజ, చంద్ర, గురు క్షేత్రాలకు), దైత్య = పాపాతి పాపులు అగుదురు, భిన్న = భేదించినవారు (అట్లు పాపులు కానివారు), దివౌకసః = వాటికి శుభాతి శుభులగుదురు.

ఇందులో గ్రహాలను బట్టి రెండు వర్గాలుగ విభజింపబడెను. రవి, చంద్ర, కుజ గురువు ఒక వర్గము– శని, బుధ, శుక్ర. ఇంకొక వర్గం–ఒకే వర్గంలోనివారు పరస్పరం మిత్రులు. ఒక వర్గం వారికి రెండోవర్గం వారు శత్రువులు.

దీనిని ప్రక్కపట్టికలో చూచిన ఎడల శని, బుధ, శుక్ర క్షేత్రాలకు ఇతర క్షేత్రాలు శత్రువులు. అట్లే రవి చంద్ర కుజ గురు క్షేత్రాలకు ఇతరములు శత్రువులు.

| లగ్నము | అతి శుభులు కోణ-భోగ | శుభులు కోణ-త్రిక | పాపులు ప్రతీప భోగ | అతి పాపులు ప్రతీపత్రిక |
| --- | --- | --- | --- | --- |
| మేషము | రవి | గురు. కుజ చంద్ర | శని శుక్ర | బుధ |
| వృషభము | శని–బుధ | శుక్ర | రవి | చంద్ర కుజ గురు |
| మిథునము | బుధ | శుక్ర–శని | చంద్ర గురు | రవి కుజ |
| కర్కాటము | కుజ–చంద్ర | గురు–రవి | శుక్ర | బుధ శని |
| సింహము | కుజ–రవి | గురు–చంద్ర | శుక్ర బుధ | శని |
| కన్యా | శుక్ర–బుధ | శని | గురు రవి | చంద్ర కుజ |
| తుల | శని | బుధ–శుక్ర | చంద్ర కుజ | రవి గురు |
| వృశ్చికము | చంద్ర గురు | రవి–కుజ | శని | శుక్ర బుధ |
| ధనుస్సు | రవి గురు | కుజ–చంద్ర | బుధ శని | శుక్ర |
| మకరం | శుక్ర శనులు | బుధ | కుజ రవి | చంద్ర గురు |
| కుంభం | శుక్ర | బుధ–శని | భౌమ చంద్ర గురు | రవి |
| మీనం | కుజ-చంద్ర–గురు | రవి | బుధ | శని శుక్ర |

పరాశర పద్ధతిలో రాహు కేతువులు ఛాయాగ్రహాలు అయినందున ప్రత్యేక రాశి ఆధిపత్యం వాటికి లేదు. కనుకనే ఈ పట్టికలో వాటికి స్థానం లేనట్లు తెలుస్తూంది. చూ : అధ్యాయం 2. శ్లో॥ 9

అనగా ఏ లగ్నమునకైనను ముఖ్యంగ లగ్న, పంచమ, నవమ భావాధిపతులు పరస్పర మిత్రులు, శుభులు అయి తృతీయ సప్తమ లాభ భావాధిపతులు శత్రువులు అగుచున్నారు.

పరాశర పద్ధతిలో వున్న సూక్ష్మం ఇదే. ఇతర పద్ధతులలో అటుల తెలుపబడలేదు. సరికదా ఇందు రాహుకేతువులకు భావాధిపత్యం తెలుపలేదు. శుభులా-పాపులా అనేది తెలుపలేదు. అస్వతంత్రులుగ నిర్ణయించెను.

బేసి రాసులు లగ్నములైనపుడు ధక్షిణములైన 2-6-10 భావాలు శత్రువులగును. 4-8-12 భావాలు (సవ్యములు) మిత్రులగును. సరిరాసులు లగ్నాలు అయినపుడు దక్షిణములైన 2-6-10 భావాలు మిత్రులగును సవ్యములైన 4-8-12 భావాలు శత్రువులగును.

బేసి రాసులు లగ్నము లైనపుడు కోణాధిపతు (1-5-9 భావాలు) లకే సవ్యాధిపత్యం (4-8-12) కూడ కలుగును. ప్రతీపాధిపతులకు (3-7-11 భావాలు) దక్షిణాధిపత్యం (2-6-10) కూడ కలుగును.

అలాగే సరిరాసులు లగ్నమైనపుడు కోణాధిపతులకు (1-5-9 భావముల) దక్షిణాధిపత్యం 2-6-10 భావాలు కూడ కలుగును. ప్రతీపాధిపతులకు (3-7-11 భావాలు) సవ్యాధిపత్యం 4-8-12 కూడ కలుగును.

ఆ ప్రకారంగ సరిభావాలు శుభ, పాపములుగ తెలుసుకొనగలము.

ఇదే విషయం పరాశర పేరుతో చెప్పబడిన గ్రంథములందు కలదు:

శ్లో॥ సర్వే త్రికోణ నేతారో గ్రహాః శుభఫలప్రదాః
పతయః త్రిమదాయానాం యది పాపఫలప్రదాః
కేంద్రాధిపాః శుభాః నదిశన్తి శుభం పాపంపాపాః
వ్యయద్వితీయ రంధ్రారిపతయః పారతన్త్రేణ
స్థానాంతరాధి పత్యేనభవన్తి ఫలదాయకాః

అన్ని గ్రహాలకు కోణాధిపత్యం కలిగి శుభ ఫలము లిచ్చెదరు. మూడు ఏడు, పదకొండు భావాలకు అధిపత్యమున్న పాపఫలమిచ్చెదరు.

నైసర్గిక శుభ గ్రహాలకు కేంద్రాధిపత్యం కలిగిన శుభం చేయరు. అట్లే నైసర్గిక పాప గ్రహాలకు కేంద్రాధిపత్యం కలిగిన పాపం చేయరు.

ఇచట కేంద్రాలు అనగా చతుర్థ దశమ భావాలనే గ్రహించవలెను. ఏల? ఒకటి—ఏడు భావాలు రెండును గురించి శుభులు, పాపులు అని ముందు తెలిపెను కనుక

ఇక రెండు, ఆరు ఎనిమిది, పన్నెండు భావాధిపతులు అస్వతంత్రులు అయినందున వారికుండే రెండో ఆధిపత్యం ప్రకారం ఫలాలు ఇచ్చెదరు. అనగా వారికి రెండో అధిపత్యం కోణాధిపత్యమైన శుభఫలాలు, మూడు, ఏడు పదకొండు భావాధిపత్యములైన పాపఫలాలు ఇచ్చెదరు.

ఇంతవరకు తెలిసిన ఈ మూడు అధ్యాయాలలోను ప్రాథమిక సంజ్ఞలు తెలిపెను, ఇవి ముందుగ క్షుణ్ణముగ తెలిసికొని అనంతరం ఫలభాగము తెలుసుకొనుము.

## 4. సంబంధ, స్థితి విచారణాధ్యాయము

ఈ అధ్యాయంలో గ్రహాల మధ్యగల సంబంధం, గ్రహాలు స్థితి అనగా భావమందు ఉనికి- గురించి విచారణ, ప్రారంభంలో సంబంధం అనగా యుతి అనిగాని లేదా ఒక గ్రహం మరొక గ్రహంను పూర్ణదృష్టితో వీక్షించుట అని తెలిపెను-(శ్లో- 3-అధ్యా-1).

ఇక స్థితి అనగా శుభ భావాధిపతులు శుభ భావము లందుండుట-లేదా పాప భావములందు ఉండుట. అట్లే పాప భావాధిపతులు శుభ భావమందుండుట లేదా పాపభావమందు ఉండుట. అలా ఉన్న భావాధిపతు లిచ్చు ఫలములులో గల వ్యత్యాసం తెలుపబడును.

అయితే ఈ గ్రంథమందు ముఖ్యంగ గమనించ దగిన విషయము- కేంద్రములు కోణములు అని సామాన్య గ్రంథములందు తెలుపు విషయాలు. ఆ కేంద్రాలు లక్ష్మీ స్థానాలు అని కోణములు విష్ణుస్థానములని ముందు తెలిపెను. (శ్లో-6-అధ్యా-1) అనగా చతుర్థ, దశమ భావాలకు పంచమ నవమ భావాలకు గల సంబంధం మాత్రమే.

మరొక విషయం. అతిశుభులు, శుభులు పాపులు, అతిపాపులు అని విభజించెను. అట్లు నాలుగు వర్గములుగ విభజించి ఆ వర్గముల మధ్య గల సంబంధాలను బట్టి ఫలములో గల వ్యత్యాసం తెలిపెను. ఇది ఇందలి విశిష్టత.

త్రయాణాం పునరాఢ్యానాం ద్వయో రతి శుభాదిషు
సంయోగే ష్వవరో యోగీ శ్రేష్టః స్వావర సంజ్ఞకః 1

అతి శుభాదిషు = అతిశుభులు మొదలుగా గలవారిలో (అనగా అతిశుభ, శుభ, పాప, అతిపాప గ్రహాలలో అని) త్రయాణాం ఆఢ్యానాం = మూడింటిలో (మొదటి మూడు—అనగా అతిశుభ, శుభ, పాప గ్రహాలలో); పునః = తిరిగి, ద్వయోః = ఇరువురు, సంయోగేషు = యుతి యందు, అవరో = తక్కువ గ్రహం, యోగీ = యోగమునిచ్చు, శ్రేష్ఠ = అధిక గ్రహం, స్వావర సంజ్ఞకః = తన ఉన్నత స్థితి నుండి తగ్గినదగును.

అతిశుభ, శుభ, పాప, అతిపాప అను నాలుగు వర్గములలో మొదటి మూడు వర్గములలో ఏ రెండు వర్గములకు చెందిన గ్రహములైనను యుతి పొందిన అందు అధమ గ్రహం మంచి యోగమునిచ్చి, ఉన్నత గ్రహం తక్కువ ఫలము నిచ్చును.

1. అతిశుభ గ్రహంతో శుభ గ్రహం యుతి.
2. అతిశుభ గ్రహంతో, పాపగ్రహ యుతి.
3. శుభ గ్రహంతో, పాప గ్రహ యుతి అని మూడు విధముల యుతి కలుగును. మూడవ అధ్యాయ మందలి పట్టిక గమనించిన (ద్వాదశ లగ్నములకు) అందలి మొదటి మూడు కాలములలో ఏ రెండు కాలముల యుతి యైనను అగును.

శ్రీ కేశవేశయో ర్యోగే దేవయో ర్యోగినా వుభౌ
దైత్య రంధ్రాన్త్య పత్యోశ్చ యోగే ద్వావపి యోగినౌ 2

దేవయోః = శుభాతిశుభు లయిన, శ్రీ కేశవేశయోః = లక్ష్మీ విష్ణు స్థానాధిపతులు, యోగే = యుతి యందు, వుభౌ = ఇరువురున్ను, యోగినా = యోగించెదరు.

దైత్య = పాపాతి పాపులయిన, రంధ్రాన్త్య పత్యోః = అష్టమ వ్యయాధి పతులు, యోగే = యుతి యందు ద్వావపి = ఇరువురు, యోగినౌ = యోగింతురు.

శుభులయిన లక్ష్మీ విష్ణు స్థానాధిపతులు అని అన్నందున ఇచట కేవలం పంచమ నవమాధి పతులిరువురు అగుదురు. అందు ఒకనికి లక్ష్మీ స్థానాధి

పత్యముండును. రెండవ వానికి త్రికాధిపత్య ముండును. లేదా ద్వితీయాధిపత్య ముండును అనగా పైన తెలిపిన అతిశుభ, శుభ గ్రహ సంబంధమైనది. లేదా ఇరువురు అతిశుభులగుదురు. అట్టి యుతి యందు ఇరువురు కూడ యోగింతురు.

ఇక పాపియైన అష్టమాధిపతికి పాపియైన వ్యయాధిపతి యుతి. అనగా ఇరువురకు ప్రతీపాధిపత్య ముండవలెను (కోణాదిపత్య మున్న శుభుడగును). కనుక ఇరువురు అతిపాపు లగుదురు. అందువలన ఏ రెండు అతిశుభుల యుతి అయినను ఇరువురు యోగింతురు. లేదా ఏ రెండు అతిపాపుల యుతి యందైనను ఇరువురు యోగింతురు.

సర్వే భావాధిపతయః సవర్ణ గృహ సంస్థితే
సవర్ణస్యచ సంయోగా త్ప్రభవిష్యన్తి యోగినః 3

సర్వే = సమస్తమయిన (అన్ని), భావాధిపతయః = భావముల అధిపతులు, సవర్ణ గృహ = తమ తమ వర్గములకు సంబంధించిన గ్రహముల భావములయందు, సంస్థితే = ఉన్నట్లు అయితే, సవర్ణస్య = తమ వర్గముతో, సంయోగాత్ = యుతి పొందుట వలన, యోగినః = యోగము నిచ్చువారయి, ప్రభవిష్యన్తి = అగుచున్నారు.

ద్వాదశ భావాధిపతులు తమతమ వర్గములకు చెందిన వారితో యుతి పొందియు తమ వర్గమువారి ఇండ్లయందుండియు మంచి యోగం నిచ్చెదరు.

అనగా శని, శుక్ర, బుధులు వాని క్షేత్రములైన మకర, కుంభ, వృషభ, మిథున, కన్యా-తులల యందు ఎచ్చట ఉన్నను ఒకరితో నొకరు యుతి పొందిననూ యోగము నిచ్చెదరు.

అట్లే రవి, చంద్ర, కుజ, గురువులు మేష, కటక, సింహ, వృశ్చిక, ధనుర్, మీనముల యందు వుండినను లేదా ఒకరితో నొకరు యుతి పొందిన యోగింతురు.

ఇది స్థితినిబట్టి తెలిపినది. పైన 1-2 శ్లో॥లో కేవలం యుతిని బట్టి తెలిపినది.

సర్వే ష్వేతేషు యోగేషు పూర్ణాలోకే పరస్పరం
బలావరో భవేద్యోగీ బలాధిక మదూషయన్ 4

ఏతేషు = ఈ పైన తెలిపిన, సర్వేషు = సమస్తమైన, యోగేషు = యోగములందు, పరస్పరం = ఒకరినొకరు, పూర్ణాలోకే = పూర్ణదృష్టితో చూచిన, బలావరో = తక్కువ బలమైన గ్రహం, యోగీ యోగించువాడై, భవేత్ = అగును, బలాధికమ్ = బలమైన గ్రహమునకు, అదూషయన్ = దోషం కలుగనీయడు.

పైన నాలుగు రకములైన యోగములు (యుతి వలన) తెలిపి అనంతరము స్థితిని గూర్చి వాటి యోగం లెట్లుండునో తెలిపెను. అలా తెలిపిన యోగము లన్నింటియందు. అనగా పూర్ణశుభుడు, పాపి ఒకరి నొకరు పూర్ణదృష్టితో చూచుకొనినచో అందు పాపి మంచి యోగము నిచ్చును కాని పూర్ణశుభునిచే ఇవ్వబడు యోగమును భంగపరచడు. అట్లే పూర్ణశుభ, శుభ గ్రహములు– శుభ, పాప గ్రహాలు లేదా పూర్ణశుభ, పాప గ్రహాలు, ఒకరినొకరు పూర్ణ దృష్టితో చూచిన యోగింతురు.

పాపులైన అష్టమ వ్యయాధిపతులు అనగా ప్రతీపాధిపత్యముతో కూడిన అష్టమ వ్యయాధిపతులు ఒకరినొకరు పూర్ణదృష్టితో చూచిన ఇరువురును యోగించెదరు.

సర్వే ష్వేతేషు యోగేషు జ్యాయసా పూర్ణ మీక్షితః
తమపశ్యన్ కనీయాంశ్చ యోగీతి సముదాహృతః 5

సర్వేషు + ఏతేషు + యోగేషు = ఈ తెలిపిన అన్ని యోగములలో, జ్యాయసా = అధిక గ్రహం-పూర్ణమీక్షితః = పూర్ణదృష్టితో చూచిన (తక్కువ గ్రహమును), కనీయాంశ్చ = తక్కువ గ్రహం, తమ్ + అపశ్యన్ = ఆ అధిక గ్రహమును చూడకున్నను, యోగి = యోగించును, ఇతి = ఈ విధముగ సముదాహృతః = ఉదహరింపబడినది.

పై శ్లోకములో అధిక, అల్ప గ్రహాలు పరస్పర పూర్ణ దృష్టి కలిగి యుండవలెనని తెలుపబడెను. కాని ఇచట అధిక గ్రహం అల్పగ్రహమును మాత్రము పూర్ణదృష్టితో చూచిన అల్పగ్రహం మంచి యోగం నిచ్చును. అయిన ఈ అల్పగ్రహం తిరిగి అధిక గ్రహమును చూడనవసరము లేదు.

అయితే ఇచట గమనించదగినది-అధిక గ్రహము అల్ప గ్రహమును చూడని ఎడల యోగముండదు. మరియు అల్పగ్రహం అధిక గ్రహమును చూచినను చూడకున్నను అధిక గ్రహం యోగించును. అని గ్రహించనగును.

దేవ శ్రీ హరిపౌ విష్ణు దేవశ్రీ గౌతు యోగినౌ
దైత్యః పద్మాలయానాథః శుభో దామోదర స్థితః 6

దేవశ్రీ, హరిపౌ = శుభుడైన లక్ష్మీ స్థానాధిపతి విష్ణు స్థానాధిపతి ఇరువురు, విష్ణు దేవశ్రీ గౌతు = విష్ణు స్థానమందు శుభమైన లక్ష్మీ స్థానమందు ఉన్నవారై, యోగినౌ = ఇరువురు యోగింతురు. దైత్యః = పాపియైన, పద్మాలయానాథః = లక్ష్మీ స్థానాధిపతి, దామోదర స్థితః = విష్ణుస్థాన మందుండి, శుభో = శుభుడగును,

ఇచట కోణాధిపత్యముతో కూడిన కేంద్రాధిపతి (అతిశుభ గ్రహము) విష్ణు స్థానమందు (కోణమందు) ఉన్న యోగించును. విష్ణు స్థానాధిపతి అనగా పంచమ లేదా నవమ కోణాధిపతి. శుభమైన లక్ష్మీ స్థానమందు అనగా కోణాధిపత్యముతో కూడ ఉన్న చతుర్థ కేంద్రమందు లేదా దశమ కేంద్రమందు ఉన్నచో యోగించును.

పాపియైన లక్ష్మీ స్థానాధిపతి అనగా ప్రతీపాధిపత్యముతో గూడిన చతుర్థ లేదా దశమాధిపతి పంచమ మందు లేదా నవమ మందు ఉన్నచో శుభుడగునని తెలుసుకొనుము.

గమనిక : కోణాధిపతి ప్రతీపాధిపతి భావములందున్న బలహీనుడగునని గ్రహించవలెను.

ఇంతవరకు తెలిపిన సంబంధ స్థితులు :-

1. అతిశుభునితో అతిశుభుని సంబంధం, స్థితి
2. అతిశుభునితో శుభుని " "
3. అతిశుభునితో పాపి " "
4. శుభునితో పాపి " "
5. అతిపాపితో అతిపాపి

తెలిపి తర్వాత అతిశుభ-అతిపాప సంబంధం తెలుపబడినది :—

అతిపా పాతిశుభయో ర్యోగే పూర్వః శుభో భవేత్
అపరో భవితా పాపః సంగజాహి గుణాఽగుణాః 7

అతి పాప + అతి శుభయోః = అతిపాప, అతిశుభ గ్రహములు రెండును, యోగే = యుతి పొందిన, పూర్వః = ముందుగ తెలిపిన గ్రహము (అతిపాపి), శుభో భవేత్ = శుభుడగును, అపరో = తర్వాత తెలిపిన గ్రహం (అతిశుభ గ్రహము), భవితాపాపః = పాపియగును, సంగజాహి = సంయోగం వలన, గుణోఽగుణాః = గుణవంతుడు గుణహీనుడై-గుణహీనుడు గుణవంతుడగును.

అనగా కోణాధిపత్యం భోగాధిపత్యం పొందిన గ్రహముతో, ప్రతీపాధిపత్యము, త్రికాధిపత్యము గలిగిన గ్రహము యుతి పొందిన ఎడల ప్రతీపాధిపతి మంచి యోగము నిచ్చి, కోణాధిపతి అవయోగము నిచ్చును.

తర్వాత అతిపాపికి శుభునితో గాని లేదా పాపితో గాని యుతి తెలుపబడును.

యుక్తః శుభే నాతిపాపః పాపేనచ శుభో భవేత్
నపాతయే చ్ఛుభం నీచై రుచ్చై రారోహయే త్పరం 8

అతిపాపః = అతిపాప గ్రహము, శుభేన = శుభగ్రహముతో, పాపేనచ = పాప గ్రహముతో గాని, యుక్తః = యుతి పొందిన, శుభో భవేత్ = శుభమైన దగును, శుభం = శుభగ్రహమును నీచైః = నీచస్థితికి, నపాతయేత్ = పడనీయదు, అపరం = అనంతరం, ఉచ్చైః = ఉచ్చస్థితికి, ఆరోహయేత్ = ఎక్కించును.

అతిపాప గ్రహముకు శుభగ్రహముతో గాని పాపగ్రహముతో గాని యుతి కలిగిన అతిపాపగ్రహం శుభమునిచ్చును-కాని ఈ యుతి వలన శుభగ్రహమును నీచస్థితికి దింపుటకు బదులు మంచి ఉచ్చస్థితికి తీసుకొనిపోవును.

అతిపాపి అనగా ప్రతీపాధిపత్యం-త్రికాధిపత్యం కలిగిన గ్రహము-శుభగ్రహమనగా కోణాధిపత్యం త్రికాధిపత్యం గలిగిన గ్రహం- రెండింటి యందు త్రికాధిపత్యం ప్రధానము. అట్టి త్రికాధిపతుల యుతి యోగము నిచ్చును.

ఈ అధ్యాయము శ్లో॥ 2 లో ప్రతీపాధిపత్యము ఉన్న అష్టమ వ్యయాధిపతులు (త్రికాధిపతులు) యుతి పొందిన ఇరువురు మంచి యోగము నిచ్చెదరు అని తెలిపెను ఇచట త్రికాధిపతులకు రెండో అధిపత్యం ఒకటి కోణము మరొకటి ప్రతీపము అయినది-గమనించదగిన అంశము.

మొత్తముపై త్రికాధిపతుల యుతి లక్ష్మీస్థానాధిపతుల యుతి కన్న మంచి యోగఫలముల నిచ్చు నని తెలియుచున్నది.

మరొక విషయము- శ్లో॥ 7-8 లలో కేవలం భావాధిపతుల యుతిని బట్టి మాత్రమే ఫలితములు తెలిపెను. దృష్టి-స్థితి గురించి తెలుప లేదు. ఆ వివరములు శ్లో॥ 3-4-5-6-లలో తెలిపినవే గ్రహించవలయును. అందు దృష్టి-స్థితి గురించి తెలుపబడెను.

త్ర్యాదీనాం భిన్న జాతీనాం యోగే జ్యాయా న్పత త్యధః
కనీయాం చ్ఛుభ సంజ్ఞస్స్యా ద్యోగినో మధ్య సంస్థితాః 9

భిన్నజాతీనాం = వేరు వేరు జాతులలో, త్ర్యాదీనాం = మూడు గ్రహములు, యోగే = యుతి యందు, జ్యాయాన్ = అధికుడు, పతత్యధః = తక్కువ ఫలము (అధఃఫలము), కనీయాం = తక్కువ గ్రహము-శుభ సంజ్ఞ స్యాత్ = శుభము చేయును-మధ్య సంస్థితాః = (ఈ ఇరువురకు) మధ్య వర్గము గ్రహము యోగినః = మంచి యోగమిచ్చును.

అతిశుభ-శుభ-పాప-అతిపాప అను నాలుగు వర్గములలో అతిశుభుడు అధికుడు. తర్వాత శుభుడు-తర్వాత పాపి-తర్వాత అతిపాపి ఒకరికన్న ఒకరు తక్కువ వారగుదురు. అటువంటి నాలుగు వర్గములలో రెండు వర్గముల యుతి వలన కలుగు శుభాశుభములు పైన తెలిపి ఇచట మూడు వర్గాల యుతి గురించి తెలుపబడెను- అవి :

1. అతిశుభ + శుభ + పాప
2. అతిశుభ + శుభ + అతిపాప
3. అతిశుభ + పాప + అతిపాప
4. శుభ + పాప + అతిపాప

} యుతి పొందిన యెడల

ఇందు ఎక్కువ గ్రహము తక్కువ (హీన) ఫలము-తక్కువ గ్రహము శుభ ఫలము ఇచ్చి మధ్యస్థ గ్రహము మంచి యోగము నిచ్చును.

| | హీన ఫలము | ఉన్నతమైన ఫలము | శుభ ఫలము |
|---|---|---|---|
| 1. | (1-5-9&2-4-10) + | (1-5-9&6-8-12) + | (2-4-10&3-7-11) |
| 2. | (1-5-9&2-4-10) + | (1-5-9&6-8-12) + | (6-8-12&3-7-11) |
| 3. | (1-5-9&2-4-10) + | (2-4-10&3-7-11) + | (6-8-12&3-7-11) |
| 4. | (1-5-9&6-8-12) + | (2-4-10&3-7-11) + | (6-8-12&3-7-11) |

మొత్తముపై సూక్ష్మ పరిశీలన చేసినచో త్రికాధిపతులు (6-8-12) మరియు ప్రతీపాధిపతులు (3-7-11) మంచి యోగఫలముల నిచ్చుచున్నారు.

## మారక విచారణాధ్యాయము

ముందుగ మారక గ్రహమును నిర్ణయించుట ఎటులు అనేది తెలుపబడును.

స్వయం లగ్నారిపతయ స్తథా లగ్నారి సంస్థితాః
లగ్నారిప యుతా దైత్యా మారకాస్యు ర్యథోత్తరమ్ 1

స్వయం = స్వయముగ, లగ్న- అరి- పతయః = లగ్నమునకు శత్రు భావముల అధిపతులు; తథా = అట్లే, లగ్నారి సంస్థితాః = లగ్నం యొక్క శత్రు భావములందు ఉన్న గ్రహములు- లగ్నారిపయుతా = లగ్నమునకు శత్రు భావాధిపతులతో యుతి పొందిన, దైత్యా = ప్రతీపాధిపతులు- యథోత్తరం = ఉత్తరోత్తర క్రమమున-మారకాః = మారకులు అగుచున్నారు.

లగ్నముకు శత్రుభావముల అధిపతులు-ఆ శత్రుభావము లందున్న గ్రహములు-ఆ శత్రు భావాధిపతులతో చేరిన పాపగ్రహములు ఒకరిని మించి మరొకరు మారకు లగుచున్నారు.

అధ్యాయము- 1. శ్లో॥ 7 లో లగ్నమునకు వ్యయ ద్వితీయ సప్తమ అధిపతులు శత్రువులు అని తెలిపెను-ఆ వ్యయ (12) ద్వితీయ (2) సప్తమ (7) అధిపతులు మారకులగుచున్నారు.

సప్తమాధిపతి అన్ని లగ్నములకు మారకుడు. కాని వ్యయాధిపతికి ద్వితీయాధిపతికి రెండవ ఆధిపత్యం ప్రతీపాధిపత్యమైన మారకులు అగుదురు. ఇందు కొన్ని లగ్నముల వ్యయాధిపతికి ప్రతీపాధిపత్యముండును. కొన్ని లగ్నముల ద్వితీయాధిపతికి ప్రతీపాధిపత్య ముండును.

అటువంటి వ్యయ-ద్వితీయ-సప్తమాధిపతులు పాపులై మారకులు అగుచున్నారు.

ఆ వ్యయ ద్వితీయ సప్తమాధిపతుల కన్న వ్యయ ద్వితీయ సప్తమ భావములందున్న గ్రహాలు బలమైన మారకులు.

ఆ భావములందున్న వారి కన్న ఆ భావాధిపతులతో యుతి పొందిన పాప గ్రహాలు బలమైన మారకులు.

వ్యయేశా ద్విత్తపః తస్మా త్సప్తమేశో ఒధికో ఒసురః 2
ఏవం స్థితౌచ సంసర్గే నిమిత్త బలనిర్ణయః

వ్యయేశాద్విత్తపః = వ్యయాధిపతి కన్న ద్వితీయాధిపతి-తస్మాత్సప్త మేశో = ఆ ద్వితీయాధిపతి కన్న సప్తమాధిపతి-అధికో = అధికమైన, అసురః = పాపులు-ఏవం = ఈ విధంగానే- స్థితౌచ = ఆయా భావాలందున్నవారు- సంసర్గే = ఆయా భావాధిపతులతో యుతి పొందిన వారు, నిమిత్త బలనిర్ణ యః = బల నిర్ణయంతో నిమిత్తమైనవారు.

ఈ అధ్యాయం మొదటి శ్లోకంలో వ్యయాధిపతి, ద్వితీయాధిపతి- సప్తమాధిపతి ఆ భావములందున్న వారు, భావాధిపతులతో యుతి పొందిన పాపులు ఒకరి కన్న ఒకరు బలీయమైన మారకులు అని తెలిపెను.

ఆ వివరం ఎక్కువ తక్కువల గురించి ఈ శ్లోకంలో తెలిపెను అది:

వ్యయాధిపతి కన్న ద్వితీయాధిపతి-ద్వితీయాధిపతికన్న సప్తమాదిపతి బలీయమైన మారకులు.

ఆ సప్తమాదిపతి కన్న వ్యయమందున్న గ్రహం-వ్యయమందున్న గ్రహం కన్న ద్వితీయమందున్న గ్రహం-ద్వితీయమందున్న గ్రహం కన్న సప్తమమందున్న గ్రహం బలమైన మారకుడు అగును.

ఆ భావములందున్న గ్రహం కన్న వ్యయాదిపతితో యుతి పొందిన పాపి-అంతకన్న ద్వితీయాదిపతితో యుతి పొందిన పాపి-అంతకన్న సప్తమాదిపతితో యుతి పొందిన పాపి బలమైన మారకు డగును.

తత్ర స్థితేషు దైత్యేషు బలీ నైసర్గిక శుభః
తేన యుక్తేషు దైత్యేషు పాపో నైసర్గికో బలీ 3

తత్ర = అచట (అనగా వ్యయ-ద్వితీయ-సప్తమ భావములందు) స్థితేషు = ఉన్న- దైత్యేషు = ప్రతీపాదిపతులలో- నైసర్గిక శుభః = నైసర్గిక శుభుడు (బుధ-పూర్ణచంద్ర-శుక్ర-గురు), బలీ = బలవంతులు-తేన యుక్తేషు= ఆ వ్యయ-లేదా ద్వితీయ-లేదా సప్తమాదిపతితో యుతి పొందిన వారిలో, దైత్యేషు = ప్రతీపాదిపతులలో- నైసర్గిక పాపో = నైసర్గిక పాపి, బలీ = బలవంతుడు. (రవి-కుజ-శని క్షీణచంద్ర).

అనగా పై తెలిపిన మారక భావములందున్న ప్రతీపాదిపతులలో గురు శుక్ర బుధులున్న ఆ మారక భావాదిపతులతో యుతి పొందిన ప్రతీపాది పతులలో రవి-కుజ-శని యున్న బలీయమైన మారకులు.

అలాభే హన్తు దైత్యస్య దేవా మారక లక్షణాః
ప్రాగుక్త తారతమ్యేన కల్ప్యంతాం జీవితాపహా 4

హన్తృదైత్యస్య = మారకము నిచ్చు ప్రతీపులు-అలాభే = లభించనపుడు మారక లక్షణాః = మారక లక్షణములు గల, దేవాః = కోణాదిపతులు- ప్రాగుక్త = ముందు తెలిపిన-తారతమ్యేన = తారతమ్యమున, కల్ప్యతాం = కల్పించవలెను-జీవితాపహా = ప్రాణహరణము చేయు గ్రహమును.

పైనతెలిపిన విధముగ ప్రాణ హరణము చేయు ప్రతీపాధిపతి లేనపుడు మారక లక్షణములు గల కోణాధిపతికి ముందు తెలిపిన క్రమములో మారకునిగ నిర్ణయించ వలెను.

అత్రాతి శుభతః శ్రేష్ఠ మష్టమేశం ప్రచక్షతే
ఉపహన్తా ఽఽయురీశత్వా త్సహి ప్రాయేణ నాయుషః 5

అత్ర = ఇచట-అతిశుభతః = అతిశుభుని కన్నను, శ్రేష్ఠం = శ్రేష్ఠమైన వానిగ-అష్టమేశం = అష్టమాధిపతిని- ప్రచక్షతే = తెలుపవలెను. ఆయురీశత్వాత్ = ఆయు స్థానాధిపతి అయినందున-ప్రాయేణ = తరచుగా, ఆయుషః = ఆయుస్సును-న ఉపహన్తా = నాశము బొందనీయడు.

పరాశరేతర గ్రంధములందు అష్టమాధిపతిని మారకునిగ తెలుపుచు న్నారు. పరాశర మతం ప్రకారం అష్టమాధిపతి అతిశుభుని కన్నను శ్రేష్టమైన వానిగ చెప్పబడెను.

వక్ష్యమాణేన మార్గేణ దీర్ఘమ ధ్యాల్ప కాయుషః 6
నిశ్చిత్య జాతకా న్పశ్చా త్కుర్యా న్మారక నిర్ణయమ్

వక్ష్యమాణ మార్గేణ = ముందు తెలుపబోవు మార్గమున, దీర్ఘ మధ్యాల్ప కాయుషః = దీర్ఘ మధ్య అల్పాయువులు, నిశ్చిత్య = నిశ్చయించి, జాతకాన్ = జాతకములందు, పశ్చాత్ = అనంతరము - మారక నిర్ణయమ్ = మారకుని నిర్ణయము, కుర్యాత్ = చేయవలెను.

జాతకమునందు మారకుని నిర్ణయించుటకు ముందుగ దీర్ఘ-మధ్య-అల్పాయువులను నిర్ణయించవలెను. అది ముందు రాబోవు అధ్యాయమునందు తెలుపబడును. దాని ప్రకారం ఆయుర్దాయము నిర్ణయించవలెను.

మారకుని నిర్ణయించుటలో తగు శ్రద్ధ వహించవలెను.

## దశాంతర్దశాధ్యాయము

ద్వాదశ భావాధిపతులు తమ తమ దశలలో భుక్తుల్లో ఇచ్చు ధన యోగము-ధనహరణము అటులనే సుఖము-కష్టము ముందు తెలిపి అనంతరం భుక్తులలో అనగా శుభుల దశల్లోని భుక్తులు పాపుల దశల్లోని భుక్తులు ఇచ్చు ఫలముల గూర్చి తెలిపెను.

శ్రీ ప్రదాః స్వ దశాకాలే వ్యయేశో లాభ నాయకః 1
భోగేశ్వరో విష్ణుపతి ర్మిత త్వేతు యధోత్తరం

శుభత్వము కలిగినచో- వ్యయాధిపతి- లాభాధిపతి, భోగాధిపతులు అనగా ద్వితీయ చతుర్థ దశమ భావాధిపతులు, విష్ణుపతిః = పగచమ నవమాధి పతులు, స్వదశాకాలే = వారి వారి దశలలో, శ్రీ ప్రదాః = ధనము నిత్తురు. యధోత్తరం = ఉత్తరోత్తర క్రమమున.

అనగా కోణాధిపతుల సంబంధమున్న వ్యయ, లాభ, ద్వితీయ, చతుర్థ, దశమ, పంచమ, నవమాధిపతులు ఒకర్ని మించి ఇంకొకరు వారి దశలలో ధనము నిచ్చెదరు.

శ్రీ హరాః స్వ దశాకాలే విష్ణీశో భోగ నాయకః
అంత్యే శాయేశ రంధ్రేశా అహితత్వే యథో త్తరమ్ 2

అహితత్వే = శుభులు కానందున. స్వదశాకాలే = తమ తమ దశాకాలమందు, విష్ణీశో = నవమ పంచమాధిపతులు, భోగనాయకః = దశమాధిపతి-చతుర్థాధిపతి- ద్వితీయాధిపతి, అంత్యేశ = వ్యయాధిపతి. ఆయేశ = లాభాధిపతి, రంధ్రేశ = అష్టమాధిపతి, యథో త్తరం = ఉ త్తరో త్తర క్రమమున-శ్రీహరాః = ధనమును హరింతురు.

జాతకమందు దశానాథుడు శుభసంబంధము లేనివాడైన అనగా కోణాధిపతి సంబంధం లేని యడల లేదా ప్రతీపాధిపతి సంబంధమున్ననూ ధనమును పోగొట్టును-అందు. నవమాదిపతి దశకన్న పంచమాదిపతి దశ అంతకన్న దశమాధిపతి దశ, అంతకన్న చతుర్ధాదిపతి దశ, అంతకన్న ద్వితీయాదిపతి దశ అంతకన్న వ్యయాదిపతి దశ-అంతకన్న లాభాదిపతి దశ అంతకన్న అష్టమాదిపతి దశ ధనమును పోగొట్టుటలో బలీయమైనవి.

ఇచట ధనయోగం కలుగుటకు- లేదా నశించుటకు ముఖ్యంగ నవమ, పంచమ దశమ, చతుర్థ, ద్వితీయ, వ్యయ, లాభ, అష్టమ భావాదిపతులు దశలందు జరుగును, అని తెలియుచున్నది.

దశాసు దేహ సుఖదాః షష్ఠే శా స్తేశ వీర్యపాః
రంధ్రేశో లగ్ననాథశ్చ హితత్వేతు యథో త్తరమ్ 3

హితత్వేతు = శుభులయినచో, షష్ఠేశ = షష్ఠాదిపతి, అస్తేశ = సప్త మాదిపతి,వీర్యపః = తృతీయాదిపతి,రంధ్రేశః = అష్టమాదిపతి, లగ్ననాథః = లగ్నాదిపతి,దశాసు = దశల యందు, యథో త్తరమ్ = ఉ త్తరో త్తర క్రమమున దేహ సుఖదాః = శరీర సౌఖ్యము నిత్తురు.

అనగా శుభత్వం పొందిన (కోణాదిపతుల సంబంధము వలన) షష్ఠభావ అదిపతి, స ప్తమాదిపతి తృతీయాదిపతి, అష్ఠమాదిపతి, లగ్నాదిపతి ఒకర్ని మించి ఒకరు తమతమ దశలందు సుఖము నిచ్చెదరు.

దశాసు దేహ కష్టాయ లగ్నేశః శత్రు నాయకః
తథా లగ్న ద్విషాం నాథా అహితత్వే యదో త్తరమ్ 4

అహితత్వే = శుభులు కానప్పుడు, లగ్నేశః = లగ్నాదిపతి, శత్రు నాయకః = షష్ఠాదిపతి, తథా = అటులే, లగ్న ద్విషాం నాథా = లగ్నమునకు శత్రుస్థానాదిపతులు (అనగా వ్యయ ద్వితీయ సప్తమాదిపతులు),యథోత్తరం = ఉత్తరోత్తర క్రమమున–దశాసు = వారి దశలయందు, దేహ కష్టాయ = శరీర కష్టము నిచ్చెదరు.

అనగా సంబంధము వలన శుభత్వము గోల్పోయినచో లగ్న–షష్ఠ–వ్యయ–ద్వితీయ-సప్తమాదిపతులు ఒకర్ని మించి మరొకరు శరీర కష్టము నిచ్చెదరు. మొత్తముపై-శరీర శుఖము నిచ్చు దశలు షష్ఠ-సప్తమ–తృతీయ–అష్టమ–లగ్న భావాదిపతులు శుభులైన ఎడల. అటులే శుభత్వం పోయిన లగ్న–షష్ఠ–ద్వాదశ-ద్వితీయ-సప్తమ భావాదిపతులు దశలందు కష్టము కలుగును.

ఆ ప్రకారము ద్వాదశ భావాధిపతుల దశలలో కలుగు ధనలాభం, ధనహాని, సుఖము, కష్టము తెలిపెను. తర్వాత అయా దశలలో వచ్చు భుక్తులందు ఎట్టి ఫలములుండును–అనునది తెలిపెను.

అగతౌజా: సురో దేయం స్వ సజాతీయ భుక్తిషు
ఫలం దద్యాద్గతౌజాస్తు భిన్న జాతీయ భుక్తిషు 5

అగతౌజా: = ప్రకాశము గోల్పోకుండ వున్న (అనగా శుభత్వమును పాప సంబంధము వలన గోల్పోకున్నచో)–సురోః = కోణాధిపతులు, ఫలం = ఫలితములు. స్వసజాతీయ భుక్తిషు = తమతో సమాన ధర్మము గల గ్రహ భుక్తులందు-దేయం = ఇచ్చెదరు.

గతౌజాస్తు = (పాప సంబంధము వలన) శుభత్వము గోల్పోయినచో–భిన్నజాతీయ భుక్తిషు = (దశానాధునికి) శత్రువర్గ గ్రహముల భుక్తులలో, ఫలం = ఫలములను, దద్యాత్ = ఇచ్చును.

అనగా ఒక కోణాధిపతి దశలో, ఆ కోణాధిపతికి ప్రతీపాధిపతి యుతి లేదా పూర్ణ వీక్షణ లేనట్లయితే మిగిలిన కోణాధిపతుల భుక్తులలో ఆ దశానాథుని ఫలితము లిచ్చును.

దశానాథునికి ప్రతీపాధిపతి యుతి లేదా పూర్ణ వీక్షణ ఉన్నచో దశా నాథుడివ్వవలసిన శుభఫలములు ప్రతీపాధిపతుల భుక్తులలో ఇచ్చును.

అగతౌజాః ఫలందేవో భిన్నజాతీయ భుక్తిషు
మిశ్రం-దద్యాద్గతౌజాస్తు స్వసజాతీయ భుక్తిషు 6

అగతౌజాః = ప్రకాశము కోల్పోనటువంటి, దేవో = కోణాధిపతుల దశ లలో, భిన్నజాతీయ భుక్తిషు = ప్రతీపాధిపతుల భుక్తులలోను, గతౌజాస్తు = ప్రకాశము కోల్పోయిన కోణాధిపతుల దశలలో, స్వసజాతీయ భుక్తిషు = తమజాతి అనగా కోణాధిపతుల భుక్తులలో మిశ్రం = మిశ్రమ ఫలములు, దద్యాత్ = ఇచ్చును.

కోణాధిపతులు ప్రతీపాధిపతి సంబంధము వలన శుభత్వము కోల్పో నట్లయితే ప్రతీపాధిపతుల భుక్తులలోను-శుభత్వము కోలోయినచో కోణాధి పతుల భుక్తులలోను మిశ్రమ ఫలము లిచ్చును.

అగతౌజాః ఫలం దైత్యో భిన్న జాతీయ భుక్తిషు
దేయం, దద్యా ద్గతౌజాస్తు స్వ సజాతీయ భుక్తిషు 7

దైత్యోః = ప్రతీపాధిపతులు (దశలో). అగతౌజాః = పాపత్వము కోల్పోనిచో (అనగా కోణాధిపతుల సంబంధము లేనిచో), ఫలం = ఫలితము లను, భిన్నజాతీయ భుక్తిషు = భిన్నజాతి గ్రహభుక్తులలో (అనగా కోణాధి పతుల భుక్తులలో), దేయం = ఇచ్చెదరు, గతౌజాస్తు = పాపత్వము కోల్పోయి నచో (కోణాధిపతుల సంబంధము వలన), స్వ సజాతీయ భుక్తిషు = స్వజాతి గ్రహభుక్తులలో అనగా ప్రతీపగ్రహ భుక్తులలో, దద్యాత్ = ఇచ్చెదరు.

అనగా ప్రతీపాధిపతులు దశలలో ఆ ప్రతిపాధిపతులిచ్చు పాపఫల ములు, ఆ దశానాధునికి కోణాధిపతి సంబంధము లేనపుడు కోణాదిపతుల భుక్తులలోను-కోణాదిపతుల సంబంధమున్నపుడు ప్రతీపాదిపతి భుక్తులలోను ఇచ్చును.

అగతౌజాః ఫలందద్యాత్ స్వ సజాతీయ భుక్తిషు
మిశ్రం దైత్యోగతౌజాస్తు భిన్నజాతీయ భుక్తిషు 8

దైత్యాః = ప్రతీపాధిపతులు, అగతౌజాః = పాపత్యము కోల్పోనివా రైనచో, స్వ సజాతీయ భుక్తిషు = తమ జాతి గ్రహభుక్తులందు, మిశ్రం

ఫలం దద్యాత్ = మిశ్రమ ఫలములు ఇచ్చెదరు, గతౌజాస్తు = ప్రకాశము కోల్పోయినచో, భిన్నజాతి భుక్తిషు = భిన్నజాతి భుక్తులలో, మిశ్రఫలం దద్యాత్ = మిశ్రమ ఫలమిచ్చెదరు.

ప్రతీపాధిపతి దశానాధుడై, పాపత్వము కోల్పోని ఎడల తానిచ్చు పాప ఫలము ప్రతీపాధిపతుల భుక్తులలోను, పాపత్వము కోల్పోయినపుడు కోణాధి పతులు భుక్తులలోను మిశ్రమ ఫలములిచ్చును.

యేన స్వ మోజో దైత్యస్య విహన్యేత సుపర్వణా
తస్యాపి భుక్తౌ ఫలదః స్వ సజాతీయ భుక్తివత్ 9

దైత్యస్య = పాపి యొక్క, సుపర్వణా = శుభుని యొక్క, స్వమోజో = స్వయం ప్రకాశము, యేన = ఎవనివలన; విహన్యేత = నశింపజేయబడు చున్నదో, తస్యాపి భుక్తౌ = ఆ రెండు గ్రహముల భుక్తలలో గూడ, స్వస జాతీయ భుక్తివత్ = తమ తమ జాతి గ్రహ భుక్తులవలె, ఫలదః = ఫలము ఇచ్చును.

పై తెలిపిన రెండు శ్లోకములలో కోణాధిపతి ప్రతీపాధిపతి సంబంధం వలన ప్రకాశము గోల్పోనపుడు తన దశలో ప్రతీపాధిపతుల భుక్తులలో తానిచ్చు శుభఫలముల నిచ్చును. అని తెలిపెను. ఏ ప్రతీపాధిపతి సంబంధం వలన శుభత్వం కోల్పోవుచున్నాడో ఆ ప్రతీపాధిపతి భుక్తిలో కూడ మిగిలిన ప్రతీపాధిపతులవలెనే శుభ ఫలములిచ్చును.

ప్రతీపాధిపతి దశానాధుడై కోణాధిపతి సంబంధము వలన తన పాపత్వము గోల్పోయినపుడు తానిచ్చు పాపఫలములు తన జాతి ప్రతీపగ్రహ భుక్తులలో ఇచ్చును. ఏ కోణాధిపతి వలన తన పాపత్వము కోల్పోవునో ఆ కోణాధిపతి భుక్తిలో కూడ ప్రతీపాధిపతి వలెనే పాప ఫలము లిచ్చును.

పాపత్వ మోజ సోహానిః శుభాతి శుభయోరిహ
శుభత్వమోజ సోహానిః తథా పాపాతి పాపయోః 10

ఇహ = ఇచట (ఈ శాస్త్రమందు), శుభాతిశుభయోః = శుభులు, అతిశుభులకు, పాపత్వం = పాపగ్రహ సంబంధము, తథా = అటులనే-పాపాతిపాపయోః = పాప-అతిపాప గ్రహములకు-శుభత్వం = శుభగ్రహ సంబంధం-ఓజసో = ప్రకాశములకు-హానిః = హాని.

కోణాధిపతులకు ప్రతీపాధిపతుల యుతి లేదా పూర్ణ వీక్షణ ఉన్నచో శుభత్వము కోల్పోవుదురు. అట్లే ప్రతీపాధిపతులకు కోణాధిపతుల యుతి లేదా పూర్ణవీక్షణ వున్న పాపత్వం కోల్పోవుదురు, అదియే ఈ శాస్త్రమందలి విశేషం.

అన్యోన్య భుక్తౌ శుక్రార్కీ విశేషేణ ఫలప్రదౌ
సురౌయది-సురారీ చేత్ కదాచిన్నా శుభప్రదౌ 11

శుక్రార్కీ = శుక్రశనులు, సురౌయది = శుభులు అయిన ఎడల-అన్యోన్య భుక్తౌ = శుక్రదశలో శని భుక్తి లేదా శని దశలో శుక్ర భుక్తిలో, విశేషేణ = వ్యత్యస్థములైన, ఫల ప్రదౌ = ఫలములను ఇచ్చెదరు—సురారీచేత్ పాపులైన ఎడల-కదాచిత్ = ఎప్పటికిని న అశుభప్రదౌ = అశుభ (ఫలములు) ఇవ్వరు.

జాతకమందు శని శుక్రులు శుభులు అనగా కోణాధిపతులైన శనిదశలో శుక్ర భుక్తి శుక్ర దశలో శని భుక్తిలోను పాపఫలములు ఇచ్చెదరు. ఇది శని-బుధ-శుక్ర క్షేత్రములు లగ్నములైనచో వాటికి వర్తించును. అనగా మకర-కుంభ-వృషభ-మిధున-కన్యా—తులా లగ్నములకు వర్తించును.

మిగిలిన లగ్నములకు పాపులగుదురు. అందువలన పాపఫలమీయరు, అనగా మీన, మేష, కర్కట, సింహ, వృశ్చిక, ధనుర్లగ్నములకు పాపఫల మీయరు.

యోగీ నిమిత్త భూతస్య భుక్తౌ శ్రేయః ఫలప్రదః
యోగి మధ్యగత త్పక్షదశా శ్రేయః ఫలప్రదా 12

యోగీ = యోగగ్రహము, నిమిత్తభూతస్య = (ఆ యోగమునకు) కారణ భూతమైన గ్రహము యొక్క,భుక్తౌ = భుక్తియందు, శ్రేయః = శ్రేష్ఠమైన, ఫల ప్రదః = ఫలమునిచ్చును; యోగి మధ్యగత = యోగము నిచ్చు గ్రహముల మధ్యనున్న-పక్షదశ = గ్రహదశ (a planet of the yogakaraka group) శ్రేయః = శ్రేష్ఠమైన; ఫలప్రదాః = ఫలముల నిచ్చును.

యోగమునకు కారణభూతమైన గ్రహ భుక్తిలో మంచి ఫలములుండును-ఆ యోగ గ్రహము కక్ష్యకు చెందిన గ్రహముల మధ్య ఉన్న భుక్తులలో కూడ మంచి ఫలితములుండును.

యః శుభో వ్యతిరేకేణ యః పాపో వ్యతిరేకతః
ఫలం వదేత్త ద్దశయోః భుక్తినాధాను సారతః 13

యః ఏ గ్రహము, వ్యతిరేకేణ = వ్యతిరేకము వలన, శుభో = శుభమైనదో–యః = ఏ గ్రహము, వ్యతిరేకతః = వ్యతిరేకము వలన– పాపో = పాపియో–తద్దశయోః = ఆ దశలలో, భుక్తి నాధానుసారతః = భుక్తి నాధుననుసరించి, ఫలం వదేత్ = ఫలము చెప్పవలెను.

ఇది రవి–చంద్రులకు వర్తించును. (అధ్యా–2–శ్లో॥ 6, 7, 8 చూడుడు) రవి–చంద్రుల దశలలో దశానాధుని బట్టిగాక విదశానాధులను బట్టి ఫలములను చెప్పవలెను.

ఫలమిష్ట మనిష్టం వాదేవోద్వైత్యోఽధవా గ్రహః
స్వభుక్తౌ నదిశేన్నౄణాం మారకస్తు దిశేత్క్వచిత్ 14

గ్రహః = గ్రహము, దేవో = కోణాధిపతియైనను, అధవా = లేదా, ద్వైత్యో = ప్రతీపాధిపతియైనను, ఫలం = ఫలితము–ఇష్టం = శుభమైనను–అనిష్టం = పాపమైనను, స్వభుక్తౌ = స్వభుక్తియందు, నృణాం = నరులకు–నదిశేత్ = ఇవ్వకుండును, మారకస్తు = మారకమైతే, దిశేత్క్వచిత్ = ఒకప్పుడిచ్చును.

కోణాధిపతియైనను, ప్రతీపాధిపతియైనను, శుభపలితముగాని–పాప పలితము గాని తన స్వభుక్తిలో ఈయడు- మారక పలితము ఒకొక్కప్పుడిచ్చును.

ఇచట లోకోక్తి:– యోగకారకుడే మారకుడని–కలదు. మంచి రాజయోగమునిచ్చు గ్రహమునకు ప్రబల మారక లక్షణములు కలిగినపుడు (మారక గ్రహసంబంధం) స్వభుక్తియందు ఆ యోగమునిచ్చి వెంటనే మారకము గూడ నిచ్చునది–ఇది అనుభవములో తెలియుచున్నది.

ఆయుర్విచార్య ప్రథమం తారతమ్య మనంతరం
నిర్ణీతం మారకం బ్రూయాద్ధన్తారం ద్వైత్య భుక్తిషు 15

ఆయుర్విచార్య = ఆయుర్ధాయమును గురించి చర్చించునపుడు-ప్రథమం = ముందుగ, తారతమ్యం = ఎక్కువ తక్కువలు (అనగా శుభపాపి

నిర్ణయం), అనంతరం = తర్వాత -మారకం = మారక గ్రహమును, నిర్ణీతం = నిర్ణయించి-హంతారం = ప్రబల మారకుని, దైత్య భుక్తిషు = పాపుల బుక్తులలో, బ్రూయాత్ = చెప్పవలెను.

అసలు జాతకుని ఆయుర్దాయమును ముందుగ నిర్ణయించి అనంతరం శుభపాప విచక్షణ చేసి (ముందు ఆయుర్దాయాధ్యాయంలో తెల్పినరీతి) పాప భుక్తుల నిర్ణయించి అప్పుడు హన్తకుని చెప్పవలెను.

నిర్ధార్యా సూక్ష్మ యాబుద్ధ్యాతాసు చైకాం వినిర్దిశేత్
అయుర్మానాఽవిరోధేన తారతమ్యం విచిన్తయేత్ 16

సూక్ష్మయాబుద్ధ్యా = సూక్ష్మబుద్ధితో, అయుర్మానాఽ విరోధేన = ఆయుర్మానముకు విరోధము గాకుండునట్లు, నిర్ధార్యా = నిర్ణయము గావించి తారతమ్యం = ఎక్కువ తక్కువలను, విచిన్తయన్ = యోచించి, తాసుచైకాం= వాటియందు ఒక దానిని, వినిర్దిశేత్ = తెలుపవలెను.

అయుర్దాయ నిర్ణయము గావించునపుడు సూక్ష్మబుద్ధితో ముందుతెలిపిన ఆయుర్దాయాధ్యాయ విషయములకు వ్యతిరేకము గాకుండునట్లు మారకలక్షణ గ్రహములను గ్రహించి అందు ఒక దానిని నిర్ణయించవలెను.

## భావాధ్యాయము

అధ్యాయే యత్రయత్రాస్మిన్నామనీ శుభపాపయోః
తత్రతత్ర నిసర్గేణేత్యధ్యాహార్యం విచక్షణైః 1

అధ్యాయే = ఈ అధ్యాయమున-యత్రయత్ర = ఎచటెచట, శుభ పాప యోః = శుభ-పాప అని, అస్మిన్నామనీ = ఈ పేర్లుంచబడునో-తత్రతత్ర = అచటచట నిసర్గేణ = నైసర్గికము అని, ఇతి = ఈ విధముగ-అధ్యాహార్యం = లోపించినటుల ఊహించుకొనవలెను-విచక్షణైః = తెలివిగ.

ఈ అధ్యాయమందు ఎచటెచట-శుభ-పాప అని చెప్పబడెనో అచట చట నైసర్గిక శుభ, నైసర్గిక పాప అని గ్రహించవలెను.

పత్యుః ప్రతీప కమలాకోణ స్వర్క్షోచ్ఛ సంస్థితే
సంబంధశ్చేశ శుభయోర్భావస్య బలవృద్ధయే 2

పత్యుః = భావాధిపతులు, త్రతీప-కమలా-కోణ = త్రతీపములు-లక్ష్మీస్థానములు-కోణములు, స్వర్షే = స్వక్షేత్రములందు- ఉచ్చ = ఉచ్చ క్షేత్రములందు, సంస్థితే = ఉన్ననూ-భావస్య = భావమునకు, ఈశ = ఆ భావాధిపతికి, శుభః = నైసర్గిక శుభుని,సంబంధః = సంబంధము(అనగా భావాధిపతి ఆ నైసర్గిక శుభుని యుతి లేదా చూచుట). బలవృద్ధయో = బలమును వృద్ధి జేయును.

త్రతీప (3, 7, 11), కమలా (4-10), కోణ (1, 5, 9) అధిపతులు స్వక్షేత్రమందు ఉచ్చయందు ఉండుట-అభాధిపతి ఆ భావమందు ఉండుట లేదా వీక్షించుట ఆ భావపతికి నైసర్గిక శుభగ్రహ సంబంధమున్ననూ లేదా ఆ భావమును వీక్షించిననూ, ఆ భావమునకు బలముండును.

తారతమ్యం త్రతీపాదౌ మిత్రామిత్రర్క్ష చింతనాత్
తేభ్యః స్వర్క్ష స్తత స్తుంగః సంబంధో బలవాం స్తతః 3

తారతమ్యం = ఎక్కువ తక్కువలు-త్రతీపాదౌ = త్రతీపములు మొదలైనవి-మిత్రామిత్రర్క్ష = మిత్రశత్రుక్షేత్రములు,చిన్తనాత్ = విచారణ యందు, తేభ్యః = వాటియందు-స్వర్క్షం = స్వక్షేత్రము-తతః = పిమ్మట, తుంగః = ఉచ్చ-సంబంధః = సంబంధం; బలవాం = బలమైనది.

పై శ్లోకంలో త్రతీప-కమలా-కోణములకు బలములు తెలుపుటలో తారతమ్యం ఇచట వివరించబడినది.

స్వక్షేత్రం-ఉచ్చక్షేత్రాలలో ఆ భావాధిపతుల స్థితి ఉన్న ఆ భావములకు బలం-అంతకన్నా ఆయా భావములందు ఆయా భావాధిపతులు స్థితి లేదా వీక్షణ బలము-అన్నిటికన్న ఆ భావాలకు నైసర్గిక శుభగ్రహం సంబంధం అనగా ఆ భావమందుండుట లేదా ఆ భావమును వీక్షించుట బలము.

అనీశ పాపసంబంధః పత్యుర్నీచ త్రికస్థితౌ
భావస్య బలనాశాయ బవతీతి వినిర్ణయః 4

అనీశ = అధిపతికాని-పాపసంబంధః = నైసర్గిక పాప సంబంధము-పత్యుః = భావాధిపతి - నీచ = నీచయందు-త్రిక = త్రికములందు-స్థితౌ =

ఉన్నను, భావస్య = భావము యొక్క. బలనాశాయ = బలము నాశమగును; భవతీతి = ఇట్లు జరుగునని, వినిర్ణయః = నిర్ణయించడమైనది.

పై తెలిపిన ప్రతీప, కమలా, కోణముల అధిపతులు, నీచయందు న్ననూ, త్రికములందున్ననూ ఆ భావములు బలహీనమగును. ఆ భావాధిపతి కాని నైసర్గిక పాపగ్రహ సంబంధం భావహాని కలిగించును.

సామాన్యరీత్యా భావానామేవం ప్రోక్తం బలాబలమ్
అయుషో నిర్ణయం వక్ష్యే విద్వత్ప్రీత్యై విశేషతః 5

భావాల బలాబలాలు ఈ విధంగ సామాన్య పద్ధతిలో తెలుపుట జరిగింది. విద్వాంసుల ప్రీతికి ఆయుర్నిర్ణయం విశేషించి చెప్పెదను

లగ్నరంధ్ర శశాంకానాం బలేనాయుర్విచిన్తయేత్
త్రిష్వాయు రబలేష్వల్పం మధ్యాల్పం హీనయోర్ద్వయోః 6
ఉభయోర్బలినో శేషే హీనేస్యాన్మధ్యదీర్ఘకం
శేషేత్యహీనే దీర్ఘాల్పం సర్వేషాం పరమంబలే 7

లగ్న అష్టమ చంద్రుల బలాలను అనుసరించి ఆయుర్దాయమును నిర్ణయించవలెను. ముగ్గురు బలహీనులైన అల్పాయుష్షు-అందు ఇరువురు దుర్బలులయిన మధ్య అల్పాయుష్షు—ఇరువురు బలీయులై ఒకడు బలహీనుడైన మధ్యదీర్ఘము-మూడవ వాడు కూడ బలహీనుడు కాకున్న దీర్ఘాల్పాయుష్షు-అందరూ బలవంతులయిన దీర్ఘాయువు.

యథైవలగ్నాద్భావానాం సర్వేషామన్వవేక్షణం
తథాభవతి చంద్రాచ్చ-సూర్యాచ్చేత్య పరేజగుః 8

లగ్నం నుండి సర్వభావాలు ఏ విధంగ పరీక్షించుచున్నామో అట్లులే చంద్రుని నుండి కూడ అగును. కొందరు సూర్యుని నుండి కూడ తెలిపెదరు.



## యోగాధ్యాయము

అరంధ్రాయా శ్లేషదోషౌ ధర్మకర్మాధినాయకౌ
రాజయోగ కరౌస్యాతాం సంబంధా త్పరివర్తనాత్ 1
లగ్నేశ యోగదృష్టిభ్యాం యోగోఽయం ప్రబలోభవేత్
రంధ్రేశ్వరస్య దైత్యస్య యోగేన శిధిలోభవేత్ 2

అష్టమ, లాభాధిపత్యములు లేని భాగ్య రాజ్యాధిపతులు పరివర్తన వలనను, సంబంధం వలనను రాజయోగకరు లగుదురు.

భాగ్యాధిపతికి అష్టమాధిపత్యముండరాదు. అటులనే రాజ్యాధిపతికి లాభాధిపత్యముండరాదు అటువంటి దోషములులేని భాగ్య రాజ్యాధిపతులు ఒకరింట మరొకరున్నను లేదా ఒకరినింకొకరు పూర్ణముగ చూచినను–లేదా యుతి పొందినను రాజయోగముండును.

పై తెలిపిన దోషహీన భాగ్య రాజ్యాధిపతులకు లగ్నాధిపతి యుతి లేదా దృష్టి వున్న ఆ యోగం ప్రబలమైన దగును. కాని ప్రతీపాధిపత్యంతో గూడిన అష్టమాధిపతి యుతి ఉన్న ఆ యోగం నాశనమగును.

అషష్ఠా యాశ్లేషదోషౌ బుద్ధికర్మాధినాయకౌ
రాజయోగకరౌ ప్రాగ్వత్సంబంధాత్పరివర్తనాత్ 3
అయంచ యోగో లగ్నేశ దృగ్యోగాభ్యాం బలీభవేత్
షష్ఠేశ్వరస్య దైత్యస్యయోగేన శిధిలోభవేత్ 4

షష్ఠ లాభాధిపత్యములు లేని పంచమ రాజ్యాధిపతులు ముందు తెలిపినట్లు పరివర్తన వలన లేదా సంబంధం వలన రాజయోగమును ఇచ్చెదరు. ఈ యోగంనకు లగ్నాదిపతి యుతి లేదా దృష్టి బలమును చేకూర్చును– కాని పాపియైన షష్ఠాధిపతి యుతి ఉన్నచో శిధిలమగును.

అవ్యయాయాశ్లేషదోషౌ లగ్న కర్మాధినాయకౌ
రాజయోగకరౌ ప్రాగ్వత్సంబంధా త్పరివర్తనాత్ 5
విష్ణ్వీశయోగ దృష్టిభ్యాం యోగోఽయం ప్రబలోభవేత్
వ్యయేశ్వరస్య యోగేన యోగోఽయం శిధిలోభవేత్ 6

వ్యయ-లాభాధిపత్యములు లేని అగ్న రాజ్యాధిపతులు ముందు తెలిపినట్లు పరివర్తన వలనను సంబంధము వలనను రాజయోగ కరులగుదురు. ఈ యోగమునకు పంచమాధిపతి లేదా భాగ్యాధిపతి యుతి లేదా దృష్టియున్న యోగము ప్రబలమగును. కాని వ్యయాధిపతి యుతి యున్న శిధిలమగును.

రాజయోగ పరశ్చంద్రో యదిసర్వ గ్రహేక్షితః
సర్వ గ్రహేక్షితం రాజ్యం యదియోగోఽన్య ఉచ్యతే 7

చంద్రుడు సర్వగ్రహములచే చూడబడినచో రాజయోగముండును- రాజ్యభావమును సర్వగ్రహములు చూచిన అది మరియొక రాజయోగమగును.

చంద్రుడు రాజ్యమందుండి అన్ని గ్రహములచే చూడబడిన విశేష రాజయోగ మగును.

విద్యతేయస్య భావస్య సర్వగ్రహవిలోకనమ్
యొగస్తద్భావ సంబంధీ భవేత్కశ్చిదనుత్తమః 8

ఏ భావమునకు అన్ని గ్రహముల దృష్టియుండునో, ఆ భావసంబంధమైన ఒకానొక ఉత్తమోత్తమమైన యోగముండును.

సర్వైః నైసర్గిక శుభైః త్రిషడాయాస్పద స్థితైః
యోగ: సూపచయోనామ ధన వృద్ధికరో నృణామ్ 9

నైసర్గిక శుభగ్రహములన్నియు మూడు- ఆరు- పదకొండు- పది భావములందున్న సు ఉపచయమను యోగం ధన వృద్ధిని కలుగ జేయును (అనుభవములో పాపగ్రహములున్ననూ ఈ యోగము సంభవించు చున్నట్లు తెలియుచున్నది).

చంద్రతశ్చేదయం యోగో బుద్ధివృద్ధి కరోభవేత్
ధనేవ్యయేచోభయత్ర శ్రీ యోగో మంగళాదిభిః 10

చంద్రుని నుండి ఉపచయములలో గ్రహాలున్న బుద్ధిని వృద్ధిజేయును.

చంద్రునికి ద్వితీయమందు లేదా వ్యయమందు లేదా ద్వితీయ వ్యయములలో కుజాది గ్రహాలున్న శ్రీ యోగమను ధనయోగముండును.

యోగః కేమద్రుమోనామ గ్రహాభావే ప్రకీర్తితః
కేంద్రస్థితే సగ్రహేవా చంద్రే నాయమితి స్థితిః 11

చంద్రునకు ద్వితీయ వ్యయములలో గ్రహాలు లేకున్న కేమద్రుమమను దరిద్ర యోగం కలుగును. అయితే చంద్రుడు కేంద్రమందున్నను లేదా గ్రహంతో యుతి పొందినను ఇది భంగమగును.

పునశ్చన్ద్రాత్సపత్నాస్తరంధ్రస్థైరఖిలైశుభైః
నైసర్గికైః భవేచ్ఛ్రేయా నధియోగోఽధికారదః 12

చంద్రుని నుండి సమస్త నైసర్గిక శుభగ్రహములు షష్ఠ సప్తమ అష్టమ ములందున్న శ్రేయమైన అధియోగమనబడు అధికారమునిచ్చు యోగముండును.

(ఇచట నైసర్గిక పాపులవలన కూడ ఈ యోగం సంభవిస్తుంది. అది క్రూరమైనది)

ఇతి సామాన్యతః ప్రోక్తం శాస్త్రం గంభీర ముజ్వలం
ఉపదేశాయ శిష్యాణాం గోకర్ణే విలసద్ధియాం 13

ఈ విధమున సామాన్యరీతిలో గంభీరము, ఉజ్వలము అయిన శాస్త్రమును, గోకర్ణ క్షేత్రమందున్న బుద్ధికుశలురైన శిష్యుల కుపదేశించుటకు చెప్పడమైనది.

ఇతి శ్రీ భగవాన్మహర్షి రమణాంతేవాసినో
వాసిష్ఠస్య నారసింహ సూనోః
గణపతేః కృతిః
హోరా నిర్ణయ సంగ్రహః
సమాప్తా

జ్యోతిశ్శాస్త్రాను సారేణ ఫలవిజ్ఞాన శాలినః
సుద్ధస్యసత్యవాక్యస్య బుద్ధిరత్ర స్రీదతి

బుద్ధిర్దే ప్రసాదేన దైవజ్ఞస్య స్ఫుటాభవేత్
తస్మాద్దేవముపాసీత దేవాహి బలవత్తరమ్

అహింసకస్య దాంతస్య ధర్మజిత ధనస్యచ
నిత్యంచనియమస్థస్య సదా సానుగ్రహంగ్రహాః

ఆశా విశూన్యస్య దయాయుతస్య సదాపి సర్వేశ్వర పూజకస్య
ఆచార సత్యాన్వితమానసస్య వాణీభవేత్సుద్ధి మతీ సభాసు

సమీరయేద్విస్తరతస్సదాపి కించిత్శుభం జాతక మధ్యవర్తి
సంసూచయే త్సూక్ష్మ తరేణశశ్వద్దుఃఖం మహజ్జాతక
మధ్యవర్తి.



